

# భాగవతసుధ

సంకలనమ్ :

డా॥ అ॥ రాఘవరావు,
MS., FICS., FIMSA.,
*Surgeon & Professor.*

ప్రకాశకులు :
శ్రీ వాసుదేవ భక్త సంఘము,
గుంటూరు.

# H.H. TRIDANDI CHINNA SRIMANNARAYANA RAMANUJA JEEAR SWAMY

SRIMANNARAYANA RAMANUJA YATHIBHYO NAMAHA

**ప్రియ శ్రీమాన్ డా॥ A. రాఘవరావుగారు**

**శ్రీమతే నారాయణాయ నమః ।**

**అనేక మంగళాశాసనములు !**

మీరు పంపిన 'భాగవతసుధ' చూచి చాల సంతోషించాం, నిత్యాను సంధేయములగు స్తోత్రరాజములను, ఆళ్వారాదుల దివ్య ప్రబంధమునందలి ముఖ్యభాగములను సంగ్రహించి ఒకచోట గూర్చుటయే గాక శ్రీ మద్భాగవత సుధారసా స్వాద నిరతులకు ప్రత్యేకముగ మీరేర్చి కూర్చిన ప్రహ్లాద, గజేంద్ర, వామన చరితలెంతో సంతోషాన్ని కల్గించగలవు. జిజ్ఞాసువులందరూ మీ ఈ శ్రమకుతగిన రీతిలో ఈ గ్రంథరాజమును అనుసంధించుచు వినియోగించుకుంటారని ఆశిస్తూ, లోకోపకారకములుగ మీ ఇట్టి అనేక కార్యములను చేయగల్గు శక్తి భగవానుడు మీకు ప్రసాదించు గాక ! యని మంగళాశాసనం చేయుచున్నాము.

చిన్న శ్రీమన్నారాయణ
రామానుజ జీయర్
14–11–1991

## శ్రమయేవ జయతే

భగవత్సేవకులు. వణిక్ప్రముఖులు. కార్యదక్షులు.

సంఘసేవకులు. సర్వభూతహితులు. నిరాడంబరులు



**శ్రీ అనుమాలశెట్టి రామారావుగారు**

కార్యదర్శి, శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి దేవస్థానము, గుంటూరు

# ఆమోదము

భక్తులకు అభీష్ట ఫలసాధనమునకు ప్రధానోపాయము భగవన్నామానుసంధానము. యుగధర్మమునుబట్టి తపస్సునో యజ్ఞయాగాదులనో ఆచరించి తరించగల శక్తి స్తోమతలు మానవునిలో సన్నగిల్లినవి. ఇంద్రియ నిగ్రహము స్థిరచిత్తత్వము దృఢాభి నివేశము నేడు ప్రతివ్యక్తి లోను కొరవడినవి. ఈ స్థితిలో, కఠోరశాస్త్ర నియమములను పాటించి ధ్యానయోగాదులను ఆచరించుట దుస్తరము.

దూరదృష్టిగల మహర్షులు లోకక్షేమమునకై ''కలౌసంకీర్త్య కేశవం'' అన్నట్లు సులభమగు భగవన్నామానుసంధానమును ఉపదేశించిరి. పూర్వాచార్యులు రచించిన స్తోత్రములను నిత్యము ఆయా నిర్ణీత సమయములలో అనుసంధించుచు, భగవంతుని ఆరాధించి ప్రసన్నుని చేసుకొనుటయే నేటి కర్తవ్యము. ఆస్తిక్యము ధర్మశ్రద్ధయు కలిగిన డా॥ A. రాఘవరావుగారు ఈ పరమార్థమును ఎరిగి తామీ మార్గమునే ఆచరణలో పెట్టుకొని జిజ్ఞాసువులైన ఇతరులకును స్తోత్రానుసంధాన పద్ధతి అందుబాటులో నుండుటకై ఈ స్తోత్ర సంకలనమును అర్థ తాత్పర్యములతో ప్రకటించిరి. చికిత్సా శాస్త్రప్రక్రియలో వృత్తిరీత్యా సంపూర్ణావగాహన కలిగియుండిగూడ కొంత సమయమును అర్థమును వెచ్చించి దేహమునకేగాక ఆత్మకును ముఖ్యముగా కావలసిన చికిత్సను ఈ రూపమున ప్రయోగాత్మకముగా వీరు నిరూపించుట సర్వధా శ్లాఘనీయము.

ఈ గ్రన్థమున ఇతర స్తోత్రములతో పాటు ధనుర్మాస వ్రతమును ఆచరించు భక్త శిఖామణుల అవసరమును దృష్టియందుంచుకొని శ్రీ విప్రనారాయణ మునీన్ద్రులచే రచితమగు సుప్రభాతరూపమగు "తిరుప్పళ్లియెఝచ్చి" అను ప్రబంధమును, శ్రీ గోదమ్మవారి "తిరుప్పావై" ప్రబంధమును, అర్థతాత్పర్యములతో ప్రకటించుటయేగాక. వాటిలో ప్రతిపాదింపబడిన శ్రీకృష్ణభగవానుని అవతారవైభవమును తెలుపు శ్రీ మహాభాగవత గ్రన్థసారమునుగూడ ప్రతిస్కంధమునుండి ఎత్తి సంక్షేపముగా ప్రతిపాదించి పాఠకులకు వీరు అందించిరి. భగవత్కైంకర్య బుద్ధితో కొనసాగుచున్న వీరి కృషి అవశ్యము సహృదయామోదయోగ్యమనుట నిస్సందేహము. వీరికి భగవదనుగ్రహముచేత సమస్త సన్మంగళానిసన్తు.

ఇట్లు,

9-11-1991

సహృదయ విధేయుడు,

శ్రీ న. చ. రఘునాథాచార్యులు.

వరంగల్-2. (ఆం. ప్ర.)

# మనవి

ఓం.

శ్రీ గోదా సమేత శ్రీరంగనాథ పరబ్రహ్మణేనమః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయము దీరయేత్ ॥

నారాయణః పరంబ్రహ్మ నారాయణ పరంతపః
నారాయణః పరోదేవః సర్వం నారాయణః సదా ॥

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగ నా డింభకున్.

పలికెడిది భాగవతమట పలికించు విభుండు రామభద్రుండట నేఁ
బలికిన భవహరమగునట, పలికెద వేరొండుగాథఁ బలుకగనేలా?

సృష్టిలోని సమస్త జీవరాసులలో మానవుని స్థానమున్నతమైనది. ఆహారం, భయం, నిద్ర, మైథునం- ఇవి పశుపక్ష్యాదులకెంతో మానవునికి అంతే. పుట్టుట గిట్టుట సామాన్యముగనే వున్నవి. కాని మానవుడు వివేక, విచక్షణా జ్ఞానములో విశిష్టత పొందియున్నాడు. ఈ వివేకము చేతనే మంచిచెడులనెఱిగి మసలుచున్నాడు.

పుట్టి, పెరిగి విద్యాబుద్ధుల నార్జించిన పిమ్మట సంసారముయొక్క హీనత్వమును, భోగాదుల క్షణభంగురత్వమును గుర్తించి మోక్షమునకు దగిన యత్నములాచరించుటయే యితర జీవ దుర్లభమైన యాతని జ్ఞానమునకు బరమ ప్రయోజనము. ఇది లోపించిన మానవుడు పశుతుల్యుడే.

అందుచే మానవులమై యుండి పురుషార్థములను (ధర్మ, అర్థ, కామ, మోక్షములు) సాధించాలి. ధర్మానుగుణముగాచేయు ప్రతికార్యము అర్థ, కామములను ప్రసాదిస్తూ గమ్యమగు మోక్షమునకు దారితీస్తుంది, కాని ధర్మమును విస్మరించి అర్థ, కామములే గమ్యముగా భావించిన మానవుని పతనమే వరిస్తుంది. కావున కర్తవ్యాన్నెఱిగి ధర్మబద్ధముగ జీవితాన్ని సాగించాలి. ఒరులుచేయు నీకప్రియమగు దానిని పరులకు చేయకుము. ఇదియే గ్రహించదగు పరమధర్మము.

ఇక కార్యసాధన కుపకరించునది రెండవది— భక్తి, శరణాగతి. ఇదియే గమ్యాన్ని చేరుస్తుంది. కలియుగంలో నామస్మరణజేసిన ముక్తిని బడయవచ్చు.

ఆహారము దేహపోషణ కెంతావశ్యకమో, ఆత్మనెఱిగి, భగవానుని జేరుటకు— భక్తి, శరణాగతి అవసరం.

అష్టోత్తర, శత, సహస్రనామావళులు పూజా కార్యక్రమములో పఠించుకొనవచ్చు. పరుండి లేచు వేళలందు సులభమున భగవానుని నామ స్మరణ జేసుకొంటు మన దినచర్యను జరుపుకొనవచ్చును.

మరణకాలమందలి చరమభావము ముఖ్యమైనది. కాని మరణ మెప్పుడు ఆసన్నమగునో ఎవరికి తెలియదు. ఒకవేళ తెలిసినను కఫ, వాత, పిత్తములు ప్రకోపించి కంఠము నావరించినను స్మృతిలేని యెడ లను, భగవానుని స్మరణ సాధ్యముకాదు. ప్రాపంచిక వాసనలు ప్రబల మైనచో మనసు వానిచే నాకర్షింపబడును. కావున మన మనసు స్వాధీన ములోనున్నపుడే భగవంతుని స్మరణ నభ్యసించవలెను. ప్రబలమగు ఈ వాసనయే చరమదశయందు నిలచును

ఒకవేళ ప్రారబ్దవశమున స్మృతిలేక మరణించినను భయములేదు. ఏ భక్తుడు జీవితకాలమంతయు అనన్యభక్తితో తనను స్మరించునో అట్టి వాని ఇహపరములకు కావలసిన యోగక్షేమములు భగవానుడే వొన గూర్చును. ఒకవేళ మరణకాలమందు తనను స్మరంచలేకపోయినప్పటికిని తానే వానిని కృతార్థుని చేయగలడు. నిస్సందేహము ఇది భగవానుని అభయము.

భగవంతుని సాన్నిధ్యాన్ని చేరడానికి భక్తి సులభసాధనం భగ వంతుడు భక్తికి వశ్యుడు ఇది సత్యం.

మనస్సులో భక్తిబీజం మొలకెత్తాలంటే, మనస్సు నిర్మలంకావాలి. మానసిక స్వచ్ఛత, సదాచారం, సత్ప్రవర్తన, సజ్జనసాంగత్యము వలన కలుగుతుంది.

భగవద్భక్తివలన మానవుడు ఉత్తమగతులను పొందుతాడు. ఉత్కృష్టమైన మానవజన్మ లభ్యంకావడం గతజన్మ వాసనాబలం.

ఈ జన్మనుండి ఆధ్యాత్మికచింతన, భగవద్భక్తి కలిగి ఒక్కొక్క సోపానము అధిగమిస్తూ భగవంతుని చేరుకోవాలి.

3. ఈ గ్రంథమందలి ప్రథమభాగమున– ఉపయుక్తములగు అష్టకములు, అర్చనకు తగు నామావళి, ద్వితీయభాగమున– గోదాదేవి ఆచరించి, ప్రసాదించిన 30 పాశురముల (భావానువాదము)తో కూడిన తిరుప్పావై, తత్సంబంధిత విషయములు కూర్చబడినవి. ఇవి ధనుర్మాసమున చేయు పూజ, పాఠనమునకెంతయో ఉపకరించును.

తృతీయభాగమున శ్రీమద్భాగవతమందలి అమృతతుల్యములైన పలు విషయములు ప్రసంగింపబడినవి. మూలగ్రంథములగు వ్యాసప్రణీత శ్రీమద్భాగవతము మహాకవి శ్రీ బమ్మెర పోతన ఆంధ్రమహాభాగవతము దీనికి మూలము,

మహనీయులగు వేదవ్యాసుడు, బమ్మెర పోతన కారణ జన్ములు, చిరస్మరణీయులు. వారికి సదా ప్రణామాంజలి. వీరి గ్రంథములనుండి కొన్ని అనువాదములను, మరి హెచ్చుభాగము (పోతన భాగవతము) యథాతథముగను సేకరించి ప్రచురించితిని.

పాఠకులు ఈ సుధను గ్రోలి, భక్తి భావన పెంపొందించుకొని, భగవత్ కృపకు పాత్రులై తమ జీవనములను ధన్యముచేసుకొందురు గాక !

4. తమ అనుగ్రహ ఆశీస్సులనందజేసిన శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారికి, ఈ గ్రంథమును పరిశీలించి ఆమోదము వ్రాసిన ఉ. వే. శ్రీమాన్ న. చ. రఘునాథాచార్యుల వారికి నా నిత్య కృతజ్ఞతలు,

తమ సలహాలు. మరియు అమూల్య సమయమును వెచ్చించి తప్పొప్పులను సరిదిద్ది ముద్రణకు సహాయపడి గ్రంథమునకు వెలుగు

జేకూర్చిన శ్రీమాన్ ముడుంబై రామానుజాచార్యులవారి సత్పుత్రులు శ్రీమాన్ నర్సింహరంగాచార్యులవారికి, శ్రీమాన్ శ్రీమన్నారాయణాచార్యులవారికి, కడుశోభాయమానముగ ముద్రించిన వేంకటరమణ బుక్ ప్రింటర్స్ యజమాన్యమువారికి సదా కృతజ్ఞుడను

5. నా మాతామహులు, వారి భార్య కీ॥ శే॥ వలివేటి నరసింహం గారు, భార్య వలివేటి మహాలక్ష్మమ్మ.

నా మాతృమూర్తి కీ॥ శే॥ అ॥ వెంకటసుబ్బమ్మ, మా అత్తగారగు కీ॥ శే॥ త్రిపురమల్లు నాంచారమ్మగార్లకు పరమేశ్వరుడు ఆత్మశాంతి, విష్ణు సాయుజ్యము చేకూర్చ ప్రార్థన.

వారల స్మృత్యర్థముగ ఈ గ్రంథము వెలువడుట నా భాగ్యము.

---

జన్మదాతలైన నా పితృమూర్తి శ్రీ అనుమాలశెట్టి రామారావు గారికి, కన్యాదాతలైన శ్రీ త్రిపురమల్లు కాశీవిశ్వనాథంగారికి పరమాత్మ ఆయురారోగ్యములు, సుఖశాంతుల నొసంగి మేమెల్లవేళల ధర్మపథమున వర్తించునట్లు అనుగ్రహింప వేడుచున్నాను.

హరివార్త లెరుగువారికి
హరి పదములు దలచువారి కనవరతంబు
హరి కథలు వినెడివారికి
మరణాగత మోహ సంభ్రమము లేదనఘా।

ఓం తత్ సత్ ।

ఏతత్ సర్వం శ్రీ గోదా రంగనాథార్పణమస్తు ।

ఇట్లు,
భవదీయుడు,
డా॥ అనుమాలశెట్టి రాఘవరావు.

# విషయ సూచిక



# భగవత్ప్రార్థన

## శ్రియఃపతీ

మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును మీ పాదారవిందము లందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుడు.

## పరమదయానిధీ!

ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును మనోవాక్కాయములచే మా వలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుడు.

## చిదచిదీశ్వరా!

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని అజ్ఞానవృత్తిగాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుడు.

## వేదాంతవేద్యా ! అభయస్వరూపా !

మాయందు భక్తి జ్ఞాన వైరాగ్యబీజము లంకురించి, శీఘ్రముగా ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుడు. మఱియు ఈ జన్మమునందే కడ తేరి మీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుడు.

## దేవా !

మీరు భక్తవత్సలురు. దీనులపాలిటి కల్పవృక్ష స్వరూపులు. మీరుతప్ప మాకింకెవరుదిక్కు? మిమ్ములను ఆశ్రయించితిమి. ఇదే మా వినతి. అనుగ్రహింపుడు. మీ దరిజేర్చుకొనుడు.

పాహిమాం, పాహిమాం, పాహిమాం, పాహి.

# శ్రీ వేంకటేశ మంగళాశాసనమ్

శ్రియఃకాన్తాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేఙ్కటనివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥ 1

లక్ష్మీసవిభ్రమాఽలోకసుభ్రూవిభ్రమచక్షుషే ।
చక్షుషే సర్వలోకానాం వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 2

శ్రీవేఙ్కటాద్రిశృఙ్గాగ్రమఙ్గళాభరణాఙ్ఘ్రయే ।
మఙ్గళానాం నివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥ 3

సర్వావయవసౌన్దర్యసమ్పదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయాస్తు వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 4

నిత్యాయ నిరవద్యాయ సత్యానన్దచిదాత్మనే ।
సర్వాన్తరాత్మనే శ్రీమద్వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 5

స్వతః సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 6

పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే :
ప్రయుఞ్జే పరతత్త్వాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 7

ఆకాలతత్త్వమశ్రాన్తమాత్మనామనుపశ్యతామ్ ।
అతృప్త్యమృతరూపాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 8

ప్రాయః స్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపయాఽఽదిశతే శ్రీమద్వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 9

దయాఽమృతతరఙ్గిణ్యాస్తరఙ్గైరివ శీతలైః ।
అపాఙ్గైః సిఞ్చతే విశ్వం వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 10

స్రగ్భూషామ్బరహేతీనాం సుషమాఽవహమూర్తయే ।
సర్వార్తిశమనాయాస్తు వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 11

శ్రీవైకుణ్ఠవిరక్తాయ స్వామిపుష్కరిణీతటే ।
రమయా రమమాణాయ వేఙ్కటేశాయ మఙ్గళమ్ ॥ 12

శ్రీమత్సున్దరజామాతృమునిమానసవాసినే ।
సర్వలోక నివాసాయ శ్రీనివాసాయ మఙ్గళమ్ ॥ 13

మఙ్గళాఽఽశాసనపరైర్మదాచార్య పురోగమైః ।
సర్వైశ్చపూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మఙ్గళమ్ ॥ 14

ఇతి శ్రీ వేంకటేశ మంగళాశాసనం సమాప్తమ్.



# శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రమ్

శ్రీమత్పయోనిధినికేతన చక్రపాణే
భోగీంద్రభోగమణిరంజితపుణ్యమూర్తే
యోగీశ శాశ్వత శరణ్యభవాబ్ధిపోత
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧

బ్రహ్మేంద్ర రుద్రమరుదర్క కిరీటకోటి
సంఘట్టితాంఘ్రికమలామల కాంతికాంత,
లక్ష్మీలసత్కుచ సరోరుహరాజహంస
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౨

సంసారసాగర విశాల కరాళ కామ
నక్రగ్రహగ్రసన నిగ్రహ విగ్రహస్య,
మగ్నస్య రాగలసదూర్మిని పీడితస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౩

సంసారఘోరగహనే చరతో మురారే
మారోగ్ర భీకర మృగ ప్రవరార్దితస్య
ఆర్తస్య మత్సరనిదాఘనిపీడితస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్, ౪

సంసారకూప మతిఘోర మగాధమూలం
సంప్రాప్య దుఃఖశతసర్పసమాకులస్య
దీనస్య దేవ కృపయా శరణాగతస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౫

సంసారభీకర కరీంద్ర కరాభిఘాత
నిష్పీడ్య మాన వపుష స్సకలార్ధితస్య,
ప్రాణప్రయాణభవభీతిసమాకులస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౬

సంసార సర్ప విషదుష్ట భయోగ్ర తీవ్ర
దంష్ట్రాకరాళవిషదగ్ధవినష్టమూర్తేః,
నాగారివాహన సుధాబ్ధినివాస శౌరే
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౭

సంసారజాలపతితస్య జగన్నివాస
సర్వేంద్రియార్థబడిశస్థఝషాత్మనస్చ,
ప్రోత్తంభితప్రచురతాలుకమస్తకస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౮

సంసారవృక్షమఘబీజమనంతకర్మ
శాఖాయుతం కరణపత్రమనంగ పుష్పం,
ఆరుహ్య దుఃఖజలధౌ పతితో దయాళో
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౯

సంసారదావదహనాకులభీకరోగ్ర
జ్వాలావళీభిరభిదగ్ధ తనూరుహస్య
త్వత్పాదయుగ్మసరసీరుహమస్తకస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౦

సంసార సాగర నిమజ్జన ముహ్యమానం
దీనం విలోకయ విభో కరుణానిధే మామ్
ప్రహ్లాదఖేదపరిహార పరావతార
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౧

సంసార యూధ గజసంహతి సింహదంష్ట్రా
భీతస్య దుష్ట మతి దైత్య భయంకరేణ
ప్రాణ ప్రయాణ భవభీతి నివారణేన
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౨

సంసార యోగిసకలేప్సితనిత్యకర్మ
సంప్రాప్య దుఃఖ సకలేన్ద్రియ మృత్యునాశ
సఙ్కల్ప సిన్ధు తనయా కుచకుఙ్కుమాఙ్క
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౩

బధ్వాకశైర్యమభటా బహు భర్త్స్యయన్తి
కర్షన్తి యత్ర పథి పాశశతైర్యదా మామ్
ఏకాకినం పరవశం చకితం దయాళో
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౪

అంధస్య మే హృతవివేకమహాధనస్య
చోరైర్మహా బలిభిరింద్రియనామధేయైః,
మోహాంధకూపకుహరే వినిపాతితస్య
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౫

లక్ష్మీపతే కమలనాభ సురేశ విష్ణో
యజ్ఞేశయజ్ఞ మధుసూదన విశ్వరూప,
బ్రహ్మణ్య కేశవ జనార్దన వాసుదేవ
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౬

ప్రహ్లాద నారద పరాశర పుణ్డరీక !
వ్యాసామ్బరీష శుకశౌనక హృన్నివాస !
భక్తానురక్త పరిపాలన పారిజాత !
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౭

ఏకేన చక్ర మపరేణ కరేణ శఙ్ఖ
మన్యేన సిన్ధు తనయా మవలమ్బ్యతిష్ఠన్
వామేతరేణ వరదాభయ హస్తముద్రాం
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౧౮

ఆద్యన్త శూన్య మజ మవ్యయ మప్రమేయ
మాదిత్య రుద్ర నిగమా వినుత ప్రభావమ్
త్వాఽమ్భోధి జాస్య మధులోలుప మత్తభృఙ్గం
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్, ౧౯

వారాహ రామ నరసింహ రమాది కాన్తా
క్రీడా విలోల విధి శూలి సుర ప్రవన్ద్య
హంసాత్మకం పరమహంస విహార లీలం
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౨౦

మాతా నృసింహశ్చ పితా నృసింహ
ౘభ్రాతా నృసింహశ్చ సఖా నృసింహ
విద్యా నృసింహో ద్రవిణం నృసింహ
స్వామీ నృసింహ స్సకలం నృసింహ ౨౧

ప్రహ్లాద మానస సరోజ విహార భృఙ్గ
గఙ్గా తరఙ్గ ధవళాఙ్గ రమా స్థితాఙ్గ
శృఙ్గార సఙ్గర కిరీట లసద్వరాఙ్గ
లక్ష్మీ నృసింహ మమ దేహి కరావలంబమ్. ౨౨

శ్రీశఙ్కరార్య రచితం సతతం మనుష్య
స్తోత్రం పఠే దిహతు సర్వగుణ ప్రసన్నమ్
సద్యో విముక్త కలుషో ముని వర్య గణ్యో
లక్ష్మీః పతేః పద ముపైతి సనిర్మలాత్మా! ౨౩

యన్మాయయార్జితవపుః ప్రచుర ప్రవాహ
మగ్నార్త మర్త్య నివహేషు కరావలంబం,
లక్ష్మీనృసింహచరణాబ్జమధువ్రతేన
స్తోత్రం కృతం శుభకరం భువి శంకరేణ. ౨౪

శ్రీమన్నృసింహవిభవే గరుడ ధ్వజాయ
తాపత్రయోప శమనాయ భవౌషధాయ
తృష్ణారి వృశ్చిక జలాగ్ని భుజఙ్గరోగ
క్లేశ వ్యయాయ హరయే గురవే నమస్తే॥ ౨౫

ఇతి శ్రీ మచ్ఛంకరాచార్య విరచితం.

# అచ్యుతాష్టకం

## (శ్రీ శంకరాచార్య కృతము)

అచ్యుతం కేశవం రామ నారాయణం
 కృష్ణ దామోదరం వాసుదేవం హరిం
శ్రీధరం మాధవం గోపికా వల్లభం
 జానకీ నాయకం రామచంద్రం భజే ॥ 1

అచ్యుతం కేశవం సత్యభామాధవం
 మాధవం శ్రీధరం రాధికాఽఽరాధితం
ఇందిరా మందిరం చేతసా సుందరం
 దేవకీ నందనం నందజం సందధే ॥ 2

విష్ణవే జిష్ణవే శంఖినే చక్రిణే
 రుక్మిణీ రాగిణే జానకీ జానయే
వల్లవీ వల్లభా యార్చితా యాత్మనే
 కంస విధ్వంసినే వంశినే తేనమః ॥ 3

కృష్ణ గోవింద హే రామ నారాయణ
 శ్రీపతే వాసుదేవాజిత శ్రీనిధే
అచ్యుతానంత హే మాధవా ధోక్షజ
 ద్వారకా నాయక ద్రౌపదీ రక్షక ॥ 4

రాక్షస క్షోభితః సీతయా శోభితో
దండకారణ్య భూ పుణ్యతా కారణం
లక్ష్మణే నాన్వితో వానరై స్సేవితో౽
గస్త్య సంపూజితో రాఘవః పాతుమాం ॥ 5

ధేనుకారిష్టకో నిష్టకృద్ద్వేషిణాం
కేశిహా కంసహృద్వంశికా వాదకః
పూతనా కోపకః సూరజా ఖేలనో
బాలగోపాలకః పాతుమాం సర్వదా ॥ 6

విద్యుదుద్ధ్యోతవత్ప్రస్ఫుర ద్వాససం
ప్రావృడం భోదవత్ప్రోల్లస ద్విగ్రహం
సవ్యయా మాలయా శోభితో రస్థలం
లోహితాంఘ్రిద్వయం వారిజాక్షం భజే ॥ 7

కుంచితైః కుంతలై ర్భ్రాజమా నాననం
రమ్యమౌళిం లసత్కుండలం గండయోః
హారకేయూరకం కంకణ ప్రోజ్జ్వలం
కింకిణీ మంజులం శ్యామలం తం భజే ॥ 8

అచ్యుతస్యాష్టకం యః పఠేదిష్టదం
ప్రేమతః ప్రత్యహం పూరుష స్సస్పృహం
వృత్తత స్సుందరం కర్తృ విశ్వంభరం
తస్య వశ్యో హరి ర్జాయతే సత్వరం ॥ 9

# రంగనాథాష్టకమ్

పద్మాదిరాజే గరుడాధిరాజే విరించిరాజే సురరాజరాజే.
త్రైలోక్యరాజేఽఖిలరాజరాజే శ్రీరంగరాజే రమతాం మనోమే ౧

శ్రీచిత్తశాయీ భుజగేంద్రశాయీ నాదార్కశాయీ ఫణిభోగశాయీ
అంభోధిశాయీ వటపత్రశాయీ శ్రీరంగరాజేరమతాం మనోమే ౨

లక్ష్మీనివాసే జగతాం నివాసే హృత్పద్మవాసే రవిబింబవాసే,
శేషాద్రివాసేఽఖిలలోకవాసే శ్రీరంగవాసే రమతాం మనోమే ౩

నీలాంబువర్ణే భుజపూర్ణకర్ణే కర్ణాంతనేత్రే కమలాకళత్రే,
శ్రీవల్లిరంగేజితమల్లరంగే శ్రీరంగరంగే రమతాం మనోమే ౪

బ్రహ్మాదివంద్యే జగదేకవంద్యే రంగే ముకుందే ముదితారవిందే,
గోవిందదేవాఖిలదేవదేవే శ్రీరంగదేవే రమతాం మనోమే ౫

అనంతరూపే నిజబోధరూపే భక్తిస్వరూపే శ్రుతిమూర్తిరూపే,
శ్రీకాంతిరూపే రమణీయరూపే శ్రీరంగరూపే రమతాంమనోమే ౬

కర్మప్రమాదే నరకప్రమాదే భక్తిప్రమాదే జగతాధిగాథే,
అనాథనాథే జగదేకనాథే శ్రీరంగనాథే రమతాం మనోమే ౭

అమోఘనిద్రే జగదేకనిద్రే విదేహ్యనిద్రే విషయాసముద్రే
శ్రీయోగనిద్రే సుఖయోగనిద్రే శ్రీరంగనిద్రే రమతాం మనోమే ౮

రంగాష్టకమిదం పుణ్యం ప్రాతఃకాలే పఠేన్నరః,
కోటిజన్మకృతం పాపం తత్ క్షణేన వినశ్యతి. ౯

# శ్రీ రంగనాథాష్టోత్తర శతనామస్తోత్రమ్

ఓం శ్రీరంగశాయినే నమః
,, శ్రీకాన్తాయ నమః
,, శ్రీప్రదాయ నమః
,, శ్రితవత్సలాయ నమః
,, అనన్తాయ నమః
,, మాధవాయ నమః
,, అజితాయ నమః
,, జగన్నాథాయ నమః
,, జగద్గురవే నమః
,, సురవర్యాయ నమః 10
,, సురారాధ్యాయ నమః
,, సురరాజాయ నమః
,, ప్రభవే నమః
,, హరయే నమః
,, హతారయే నమః
,, విశ్వేశాయ నమః
,, శాశ్వతాయ నమః
,, శమ్భవే నమః
,, అవ్యయాయ నమః
,, భక్తార్తిభఞ్జనాయ నమః 20

ఓం వాగ్మినే నమః
,, వీరాయ నమః
,, విఖ్యాతినే నమః
,, కీర్తిమతే నమః
,, భాస్కరాయ నమః
,, శాస్త్ర తత్త్వజ్ఞాయ నమః
,, దైత్యశాస్త్రే నమః
,, అమరేశ్వరాయ నమః
,, నారాయణాయ నమః
,, నరహరయే నమః 30
,, నీరజాక్షాయ నమః
,, నర ప్రియాయ నమః
,, బ్రహ్మణ్యాయ నమః
,, బ్రహ్మకృతే నమః
,, బ్రహ్మణే నమః
,, బ్రహ్మాంగాయ నమః
,, బ్రహ్మపూజితాయ నమః
,, కృష్ణాయ నమః
,, కృతజ్ఞాయ నమః
,, గోవిన్దాయ నమః 40

ఓం హృషీకేశాయ నమః
,, అఘనాశనాయ నమః
,, విష్ణవే నమః
,, జిష్ణవే నమః
,, జితారాతయే నమః
,, సజ్జన ప్రియాయ నమః
,, ఈశ్వరాయ నమః
,, త్రివిక్రమాయ నమః
,, త్రిలోకేశాయ నమః
,, త్రయ్యర్థినే నమః 50
,, త్రిగుణాత్మకాయ నమః
,, కాకుత్థ్సాయ నమః
,, కమలాకాన్తాయ నమః
,, కాళీయోరగమర్దనాయ నమః
,, కాలామ్బుదశ్యామలాంగాయ నమః
,, కేశవాయ నమః
,, క్లేశనాశనాయ నమః
,, కేశిప్రభఞ్జనాయ నమః
,, కాన్తాయ నమః
,, నన్దసూనవే నమః 60
,, అరిన్దమాయ నమః
,, రుక్మిణీవల్లభాయ నమః
,, శౌరయే నమః
,, బలభద్రాయ నమః
,, బలానుజాయ నమః

ఓం దామోదరాయ నమః
,, హృషీకేశాయ నమః
,, వామనాయ నమః
,, మధుసూదనాయ నమః
,, పూతాయ నమః 70
,, పుణ్యజనధ్వంసినే నమః
,, పుణ్యశ్లోకశిఖామణయే నమః
,, ఆదిమూర్తయే నమః
,, శాన్తమూర్తయే నమః
,, అమూర్తిమతే నమః
,, పరంబ్రహ్మణే నమః
,, పరంధామ్నే నమః
,, పావనాయ నమః
,, పవనాయ నమః
,, విభవే నమః 80
,, చంద్రాయ నమః
,, ఛందోమయాయ నమః
,, రామాయ నమః
,, సంసారామ్బుధితారకాయ నమః
,, ఆదితేయాయనమః
,, అచ్యుతాయ నమః
,, భానవే నమః
,, శంకరాయ నమః
,, శివాయ నమః
,, ఊర్జితాయ నమః 90

ఓం మహేశ్వరాయ నమః
,, మహాయోగినే నమః
,, మహాశక్తయే నమః
,, మహాత్ప్రియాయ నమః
,, దుర్జనధ్వంసకాయ నమః
,, అశేష సజ్జనోపాస్తి సత్ఫలాయ నమః
,, పక్షీన్ద్రవాహనాయ నమః
,, అక్షోభ్యాయ నమః

ఓం క్షీరాబ్ధి శయనాయ నమః
,, విధవే నమః 100
,, జనార్దనాయ నమః
,, జగద్ధేతవే నమః
,, జితమన్మధ విగ్రహాయనమః
,, చక్రపాణయే నమః
,, శంఖధారిణే నమః
,, శార్జినే నమః
,, ఖడ్గినే నమః
,, గదాధరాయ నమః 108



# శ్రీ గోదాఽష్టోత్తర శతనామ స్తోత్రము

శ్రీరంగనాయకీ గోదా । విష్ణుచిత్తాత్మజా సతీ ।
గోపీవేషధరా దేవీ । భూసుతా భోగశాలినీ ॥ ౧

తులసీకాననోద్భూతా । శ్రీధన్విపురవాసినీ ।
భట్టనాథప్రియకరీ । శ్రీకృష్ణహితభోగినీ ॥ ౨

ఆముక్తమాల్యదా బాలా । రంగనాథప్రియా పరా ।
విశ్వంభరా కలాలాపా । యతిరాజసహోదరీ ॥ ౩

కృష్ణానురక్తా సుభగా । సులభశ్రీః సలక్షణా ।
లక్ష్మీప్రియసఖీ శ్యామా । దయాంచిత దృగంచలా ॥ ౪

ఫల్గుణ్యావిర్భవా రమ్యా । ధనుర్మాసకృతవ్రతా ।
చంపకాశోకపున్నాగ । మాలతీవిలసత్కచా ॥ ౫

ఆకారత్రయసంపన్నా । నారాయణసమాశ్రితా ।
శ్రీమదష్టాక్షరీమంత్ర । రాజస్థితమనోరథా ॥ ౬

మోక్షప్రదాననిపుణా । మంత్రరత్నాధిదేవతా ।
బ్రహ్మణ్యా లోకజననీ । లీలామానుషరూపిణీ ॥ ౭

బ్రహ్మజ్ఞానప్రదా మాయా । సచ్చిదానన్దవిగ్రహా ।
మహాపతివ్రతా విష్ణు - గుణకీర్తనలోలుపా ॥ ౮

ప్రపన్నార్తిహరా నిత్యా । వేదసౌధవిహారిణీ ।
శ్రీరంగనాథమాణిక్య - మంజరీ మంజుభాషిణీ ॥ ౯

సుగంధార్థ గ్రంధకరీ । రంగమంగళదీపికా ।
ధ్వజవజ్రాంకుశాబ్జాంక - మృదుపాదతలాంచితా ॥ ౧౦

తారకాకారనఖరా । ప్రవాళమృదులాంగుళీ ।
కూర్మోపమేయ పాదోర్ధ్వ భాగా, శోభనపార్ష్ణికా ॥ ౧౧

వేదార్థభావవిదితతత్వబోధాంఽఘ్రిపంకజా ।
ఆనందబుద్బుదాకార - సుగుల్ఫా, పరమాణుకా ॥ ౧౨

తేజశ్శ్రియోజ్జ్వలధృత - పాదాంగుళీ సుభూషితా ।
మీనకేతనతూణీర చారుజంఘావిరాజితా ॥ ౧౩

కకుద్వజ్జాను యుగ్మాఢ్యా । స్వర్ణరంభాభసక్థికా ।
విశాలజఘనా పీనసుశ్రోణీ మణిమేఖలా ॥ ౧౪

ఆనందసాగరావర్త । గంభీరాంభోజనాభికా ।
భాస్వద్వళిత్రికా చారు - జగత్పూర్ణమహోదరీ ॥ ౧౫

నవమల్లీ రోమరాజీ । సుధాకుంభాయతస్తనీ ।
కల్పమాలానిభభుజా - చంద్రఖండనఖాంచితా ॥ ౧౬

సుప్రవాంగుళీన్యస్త - మహారత్నాంగుళీయకా ।
నవారుణప్రవాళాభ - పాణిదేశసమంచితా ॥ ౧౭

కంబుకంఠీ సుచుబుకా । బింబోష్ఠీ కుందదంతయుక్ ।
కారుణ్యరసనిష్యంది - నేత్రద్వయసుశోభితా ॥ ౧౮

ముక్తాశుచిస్మితా చారు । చాంపేయనిభనాసికా ।
దర్పణాకారవిపుల - కపోలద్వితయాంచితా ॥ ౧౯

అనంతార్క ప్రకాశోద్య - న్మణితాటంకశోభితా ।
కోటిసూర్యాగ్నిసంకాశ - నానాభూషణభూషితా ॥ ౨౦

సుగంధవదనాసుభ్రూః । అర్ధచంద్రదలలాటికా ।
పూర్ణచంద్రాననా, నీల - కుటిలాలకశోభితా ॥ ౨౧

సౌందర్యసీమా, విలస - త్కస్తూరీతిలకోజ్జ్వలా ।
ధగద్ధగాయమానోద్య న్మణీసీమంతభూషణా ॥ ౨౨

జాజ్వల్యమాన సద్రత్న - దివ్యచూడావతంసకా ।
సూర్యార్ధచంద్రవిలస ద్భూషణాంచితవేణికా ॥ ౨౩

విగన్నిగద్రత్నపుంజ ప్రాంతస్వర్ణనిచోళికా ।
సద్రత్నాంచిత విద్యోత విద్యుత్పుంజాభ శాటికా ॥ ౨౪

అత్యర్కానలతేజోధి మణికంచుకధారిణీ ।
నానామణిగణాకీర్ణ హేమాంగదసుభూషితా ॥ ౨౫

కుంకుమాగరు కస్తూరీ దివ్యచందనచర్చితా ।
స్వోచితౌజ్జ్వల్యవివిధ విచిత్రమణిహారిణీ ॥ ౨౬

అసంఖ్యేయసుఖస్పర్శ సర్వాతిశయ భూషణా ।
మల్లికాపారిజాతాది దివ్యపుష్పస్రగంచితా ॥ ౨౭

శ్రీరంగనిలయా పూజ్యా దివ్యదేశసుశోభితా ।
ఏవం శ్రీరంగనాయక్యాః నామ్నామష్టోత్తరం శతమ్ ।
యోనరః పఠతేనిత్యం । నిత్యానిర్వాణసంపదమ్ ।
లబ్ధ్వా రంగపతేర్దాస । దాససక్తోభవిష్యతి ॥ ౨౮



# గోదా చతుశ్లోకి

నిత్యాభూషా నిగమశిరసా నిస్సమోత్తుంగ వార్తా
కాన్తోయస్యాః కచవిలులితైః కాముకో మాల్యరత్నైః
సూక్త్యాయస్యాః శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ
సైషాదేవీ సకలజననీ సిఞ్చతాన్మా మపాంగైః 1

మాతాచేత్తులసీ పితా యదితవ శ్రీవిష్ణుచిత్తోమహాన్
భ్రాతాచేద్యతిశేఖరః ప్రియతమః శ్రీరఙ్గధామాయది
జ్ఞాతా రస్తనయాస్త్వదుక్తి సరస స్తన్యేన సంవర్ధితాః
గోదాదేవి కధం త్వ మన్యమనిశం సాధారణాశ్రీరసి. 2

కల్పాదౌ హరిణాస్వయం జనహితం దృష్టేన సర్వాత్మనాం
ప్రోక్తంస్వస్యచ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణం
సర్వేషాం ప్రకటం విధాతుమనిశం శ్రీధన్వి నవ్యేపురే
జాతాం వైదిక విష్ణుచిత్త తనయాం గోదాముదారాంస్తుమః. 3

ఆకూతస్య పరిష్క్రియా మనపమా మాసేచనం చక్షుషోః
ఆనన్దస్య పరంపరామనుగుణా మారామ శైలేశితుః
తద్దోర్మధ్య కిరీటకోటి ఘటిత స్వోచ్ఛిష్ట కస్తూరికా
మాల్యామోదసమేధితాత్మ విభవాం గోదాముదారాంస్తుమః.

స్వోచ్ఛిష్ట మాలికాబంధ గన్ధబన్ధురజిష్ణవే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళం.

మాదృశా కిఞ్చన త్రాణ బద్ధకఙ్కణ పాణయే
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళం.



# శ్రీ గోదాష్టోత్తర శతనామావళిః

ఓం శ్రీరంగనాయకై్యనమః
,, గోదాయై నమః
,, విష్ణుచిత్తాత్మజాయై నమః
,, సత్యై నమః
,, గోపీ వేషధరాయై నమః
,, దేవై్య నమః
,, భూసుతాయై నమః
,, భోగశాలిన్యై నమః
,, తులసీకాననోద్భూతాయైనమః
,, శ్రియై నమః ౧౦
,, ధన్విపురవాసిన్యై నమః
,, భట్టనాథ-ప్రియకర్యై నమః
,, శ్రీకృష్ణహిత-భోగిన్యైనమః
,, ఆముక్త మాల్యదాయై నమః
,, బాలాయై నమః
,, రంగనాథప్రియాయై నమః
,, పరాయై నమః
,, విశ్వంభరాయై నమః
,, కలాలాపాయై నమః
,, యతిరాజసహోదర్యై నమః ౨౦

ఓం కృష్ణానురక్తాయై నమః
,, సుభగాయై నమః
,, సులభశ్రియై నమః
,, సలక్షణాయై నమః
,, లక్ష్మీప్రియసఖై్య నమః ౨౫
,, శ్యామాయై నమః
,, దయాంచిత-దృగంచలాయై నమః
,, ఫల్గుణ్యావిర్భావాయై నమః
,, రమ్యాయై నమః
,, ధనుర్మాసకృత వ్రతాయైనమః
,, చంపకాశోక-పున్నాగమాలతీ విలసత్కచాయై నమః
,, ఆకారత్రయసంపన్నాయైనమః
,, నారాయణ-సమాశ్రితాయై నమః
,, శ్రీమదష్టాక్షరీమంత్ర రాజస్థిత-మనోరథాయై నమః
,, మోక్షప్రదాననిపుణాయై నమః ౩౫
,, మంత్రరత్నాధి దేవతాయై నమః

ఓం బ్రహ్మణ్యాయై నమః
,, లోకజనన్యై నమః
,, లీలామానుషరూపిణ్యై నమః
,, బ్రహ్మజ్ఞాయై నమః ౪౦
,, అనుగ్రహాయై నమః
,, మాయాయై నమః
,, సచ్చిదానంద-విగ్రహాయై నమః
,, మహాపతివ్రతాయై నమః
,, విష్ణుగుణకీర్తనలోలుపాయై నమః
,, ప్రపన్నార్తిహరాయై నమః
,, నిత్యాయై నమః
,, వేదసౌధవిహారిణ్యై నమః
,, శ్రీరంగనాథ మాణిక్యమంజర్యై నమః
,, మంజుభాషిణ్యైనమః
,, సుగంధార్థగ్రంథకర్త్ర్యైనమః
,, రంగమంగళ దీపికాయై నమః
,, ధ్వజవజ్రాంకుశాబ్జాంక-మృదుపాదతలాంచితాయై నమః
,, తారకాకార-నఖరాయైనమః
,, ప్రవాళ-మృదులాంగుళ్యై నమః ౫౦

ఓం కూర్మోపమేయపాదోర్ధ్వభాగాయై నమః
,, శోభనపార్ష్ణికాయై నమః
,, వేదార్థభావవిదిత తత్త్వబోధాంఘ్రి-పంకజాయై నమః
,, ఆనంద-బుద్బుదాకార సుగుల్ఫాయై నమః
,, పరమాయై నమః ౬౦
,, అణుకాయై నమః
,, తేజ-శ్శ్రియోజ్జ్వలధృత పాదాంగుళీ-సుభూషితాయై నమః
,, మీనకేతన-తూణీర-చారు జంఘా-విరాజితాయై నమః
,, కకుద్వజ్జానుయుగ్మాఢ్యాయై నమః
,, స్వర్ణరంభాభ-సక్థికాయైనమః
,, విశాలజఘనాయై నమః
,, పీనసుశ్రోణ్యై నమః
,, మణిమేఖలాయై నమః
,, ఆనందసాగరావర్త-గంభీరాంభోజ-నాభికాయై మనః
,, భాస్వద్వళిత్రికాయై నమః ౭౦
,, చారుజగత్పూర్ణ-మహోదర్యై నమః

ఓం నవమల్లీ-రోమరాజ్యై నమః
,, సుధాకుంభాయిత-స్తన్యై నమః
,, కల్పమాలానిభభుజాయై నమః
,, చంద్రఖండినఖాంచితాయై నమః
,, సుప్రవాళాంగుళిన్యస్త-మహారత్నాంగుళీయకాయై నమః
,, నవారుణ-ప్రవాళాభ-పాణిదేశ-సమంచితాయై నమః
,, కంబుకంఠ్యై నమః
,, సుచుబుకాయై నమః
,, బింబోష్ఠ్యై నమః లం
,, కుందదంతయుజే నమః
,, కారుణ్యరస నిష్యంది-నేత్రద్వయ-సుశోభితాయై నమః
,, ముక్తా-శుచిస్మితాయై నమః
,, చారుచాంపేయ-నిభ-నాసికాయై నమః
,, దర్పణాకార-విపుల-కపోలద్వితయాంచితాయైనమః
,, అనంతార్క-ప్రకాశోద్యన్మణితాటంక-శోభితాయై నమః

ఓం కోటిసూర్యాగ్ని-సంకాశ-నానాభూషణ-భూషితాయై నమః
,, సుగంధ వదనాయై నమః
,, సుభ్రువే నమః
,, అర్ధచంద్ర లలాటికాయైనమః
,, పూర్ణచంద్రాననాయై నమః
,, నీలకుటిలాలక శోభితాయై నమః
,, సౌందర్యసీమాయై నమః
,, విలసత్కస్తూరీ-తిలకోజ్జ్వలాయై నమః
,, ధగద్ధగాయమానోద్యన్మణి-సీమంత భూషణాయై నమః
,, జాజ్జ్వల్యమాన-సద్రత్న-దివ్య-చూడావతంసకాయై నమః
,, సూర్యార్ధచంద్ర-విలసద్భూషణాంచిత-వేణికాయై నమః
,, నిగన్నిగద్రత్న పుంజ-ప్రాంత-స్వర్ణనిచోళికాయై నమః

ఓం సద్రత్నాంచిత-విద్యోత-
విద్యుత్కుంజాభ-శాటికాయై
నమః
,, అత్యర్కానల-తేజోధికమణి-
కంచుకధారిణ్యై నమః ౧౦౦
,, నానామణి గణాకీర్ణ-హేమాం
గద-సుభూషితాయై నమః
,, కుంకుమాగరు-కస్తూరీ -
దివ్యచందన-చర్చితాయై
నమః

ఓం స్వోచితౌజ్జ్వల్య వివిధ-
విచిత్ర మణిహారిణ్యై నమః
,, అసంఖ్యేయ-సుఖస్పర్శ-
సర్వాతిశయ-భూషణాయై
నమః
,, మల్లికా-పారిజాతాది-దివ్య
పుష్పస్రగంచితాయై నమః
, శ్రీరంగనిలయాయై నమః
,, పూజ్యాయై నమః
,, దివ్యదేశసుశోభితాయై
నమః ౧౦౮

శ్రీ గోదాష్టోత్తర శతనామావళి
సంపూర్ణమ్



# శ్రీ కృష్ణాష్టకమ్

వసుదేవ సుతం దేవం । కంసచాణూర మర్దనమ్ ।
దేవకీ పరమానందం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 1

అతసీపుష్ప సంకాశం । హారనూపుర శోభితమ్ ।
రత్నకంకణ కేయూరం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 2

కుటిలాలక సంయుక్తం । పూర్ణచంద్ర నిభాననమ్ ।
విలసత్కుండల ధరం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 3

మందారగంధ సంయుక్తం । చారుహాసం చతుర్భుజమ్ ।
బర్హిపింఛావ చూడాఙ్గం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 4

ఉత్ఫుల్లపద్మ పత్రాక్షం ॥ నీలజీమూత సన్నిభమ్ ।
యాదవానాం శిరోరత్నం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 5

రుక్మిణీకేళి సంయుక్తం । పీతాంబర సుశోభితమ్ ।
అవాప్త తులసీ గంధం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 6

గోపికానాం కుచద్వంద్వ । కుంకుమాంకిత వక్షసమ్ ।
శ్రీనికేతం మహేష్వాసం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 7

శ్రీవత్సాంకం మహోరస్కం । వనమాలా విరాజితమ్ ।
శంఖచక్ర ధరం దేవం । కృష్ణం వందే జగద్గురుమ్ ॥ 8

కృష్ణాష్టక మిదం పుణ్యం । ప్రాతరుత్థాయ యఃపఠేత్ ।
కోటిజన్మ కృతం పాపం । స్మరణేన వినశ్యతి ॥



# పాదుకానియమ్నం

మణవాళ మామునితనియన్ — నమ్పెరుమాళ్ళు సాదించినది

1. శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్॥

తమకాచార్యులైన తిరువాయ్ మొళిప్పిళ్ళగారికి పూర్ణ కృపా పాత్రులై, జ్ఞాన భక్తి వైరాగ్యాది సమస్త కళ్యాణ గుణాకరులైన యతీన్ద్ర ప్రవణులని తిరునామముగల మణవాళ మామునులను నేనాశ్రయించుచున్నాను.

శ్రీగురుపరంపర తనియన్—కూరత్తాళ్వాన్ సాదించినది.

2. లక్ష్మీనాథ సమారమ్భాం నాథ యామున మధ్యమామ్।
అస్మదాచార్య పర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

ద్వయ మంత్రమును మొదట ప్రవర్తింపజేసి ప్రథమాచార్యుడై మనకు పరమోపకారకుడైన శ్రియఃపతి మొదలు ప్రవర్తించినదై, ఉత్తారకాచార్యులైన నాథయామునుల యతివరులను మధ్యమందుగల మనయాచార్యులవఱకు గల గురుపరంపరను నే నాశ్రయించుచున్నాను.

ఎంబెరుమానార్ తనియన్—కూరత్తాళ్వాన్ సాదించినది.

3. యో నిత్యమచ్యుత పదామ్బుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే।
అస్మద్గురో ర్భగవతోస్య దయైక సిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే॥

అసారములైన దేవతాన్తర విషయాన్తరములను వదలి నిరతిశయభోగ్యమైన శ్రియఃపతియొక్క శ్రీపాదముల ననవరతము ధ్యానించుచున్న పరమ దయాళువైన మహాప్రభావముగల ఉడయవర్ల యొక్క తిరువడి గళ్ల నేనే ఆశ్రయించితిని.

నమ్మాళ్వార్ తనియన్—ఆళవందార్ సాదించినది.

4. మాతాపితా యువతయ స్తనయా విభూతిః।
సర్వంయదేవ నియమేన మదన్వయానామ్।
ఆద్యస్యనః కులపతే ర్వకుళాభిరామం।
శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా॥

మనకును మనసంబంధులకును సకలవిధ సుఖముల నిచ్చుచున్న నమ్మాళ్వార్ల యొక్క పరమప్రాప్యమైన శ్రీపాదములను నే నాశ్రయించుచున్నాను.

ఆళ్వారుల తనియన్—శ్రీపరాశరభట్టర్ అనతిచ్చినది.

5. భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్।
భక్తాఙ్ఘ్రిరేణు పరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోస్మి నిత్యమ్॥

పొయ్‌గైయార్, పూదత్తార్, పేయార్, భట్టనాథులు తిరుమళిశైప్పిరాన్, కులశేఖర ప్పెరుమాళ్. తిరుప్పాణన్ తొండరిప్పొడి తిరుమఙ్గైయాళ్వారులు ఉడైయవర్లు వీరిని తమ కవయవములుగాగల నమ్మాళ్వార్ల నాశ్రయించుచున్నాను.



## పెరియాళ్వార్ ఆనతిచ్చిన

# తిరుప్పల్లాణ్డు

గురుముఖమనధీత్య ప్రాహ వేదానశేషాన్
నరపతిపరిక్లృప్తం శుల్కమాదాతుకామః।
శ్వశురమమరవన్ద్యం రఙ్గనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి॥

పాండియభట్టర్ సాదించినది

మిన్నార్ తడమదిళ్శూళ్ విల్లిపుత్తూరెన్ఱొరుకాల్*
శొన్నార్ కళల్కమలం శూడినోం*-మున్నాళ్
కిళియఱుత్తా నెన్ఱురైత్తోం* కీళ్ మైయినిల్ శేరుమ్
వళియఱుత్తోం నెఞ్జమే! వన్దు.

పాణ్డియన్ కొణ్డాడ ప్పట్టర్పిరాన్ వన్దానెన్ఱు*
ఈణ్డియ శఙ్గ మెడుత్తూద * వేణ్డియ
వేదఙ్గళోది విరైన్దు కిళియఱుత్తాన్*
పాదఙ్గళ్ యాముడైయ పత్తు.

● పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు. పలకోడి నూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా!* ఉన్ శేవడి శెవ్వితిరుక్కాప్పు. 1

● అడియోమోడుం నిన్నోడుం పిరివిన్ఱి ఆయిరం పల్లాణ్డు*
వడివాయ్నిన్వలమార్బినిల్ వాళ్ గిన్ఱ మఙ్గైయుం పల్లాణ్డు*
వడివార్ శోది వలత్తుఱైయుం శుడరాళియుం పల్లాణ్డు*
పడైపోర్ పుక్కుముళఙ్గుం అప్పాఞ్జశన్నియముం పల్లాణ్డే. 2

వాళాట్పట్టునిన్ఱిరుళ్ళిరేల్ వన్దు మణ్ణుం మణముఙ్గొళ్మిన్*
కూళాట్పట్టునిన్ఱీర్గళై యెఙ్గళ్‌కుళువినిల్ పుగుదలొట్టోమ్*
ఏళాట్కాలుం పళిప్పిలోం నాఙ్గళ్ ఇరాక్కదర్ వాళ్* ఇలఙ్గై
పాళాలాగ ప్పడై పొరుదానుక్కు పల్లాణ్డు కూరుదుమే. 3

ఏడునిలత్తిల్ ఇడువదన్మున్నం వన్దు ఎఙ్గళ్ కుళాంపుగున్దు*
కూడుమనముడై యీర్కళ్ వరంబొళి వన్దొల్లైక్కూడుమినో*
నాడునగరముం నన్గఱియ నమోనారాయణాయ వెన్ఱు*
పాడుమనముడై ప్పత్తరుళ్ళీర్। వన్దుపల్లాణ్డు కూఱుమినే. 4

అణ్డక్కులత్తుక్కదిపదియాగి అశురరిరాక్కదరై*
ఇణ్డక్కులత్తై యెడుత్తుక్కళైన్ద ఇరుడీకేశన్‌తనక్కు*
తొణ్డక్కులత్తిలుళ్ళీర్। వన్దడితొళుదు అయిరనామం శొల్లి*
పణ్డకులత్తైత్తవిర్న్దు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్మినే. 5

ఎన్దైతన్దైతన్దై తన్దైతమ్మూత్తప్పన్ ఏళ్పడికాల్ తొడఙ్గి*
వన్దు వళివళియాట్చెయ్‌గిన్ఱోమ్* తిరువోణ త్తిరువిళవిల్
అన్దియమ్బోదిల్ అరియురువాగి యరియై యళిత్తవనై*
పన్దనైతీర ప్పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్ఱు పాడుదుమే. 6

తీయిఱ్పొలిగిన్ఱ శెఞ్జుడరాళి తిగళ్‌తిరు చ్చక్కరత్తిన్*
కోయిఱ్పొఱియాలే యొత్తుణ్ణునిన్ఱు కుడికుడియాట్చెయ్‌గిన్ఱోమ్*
మాయప్పొరుపడై వాణనై అయిరన్దోళుం పొళికురుది
పాయ* చుళత్తియ ఆళియవల్లానుక్కు పల్లాణ్డు కూఱుదుమే. 7

నెయ్యిడై నల్లదోర్ శోఱుం నియతముం అత్తాణిచ్చేవగముమ్*
కైయడై క్కాయుం కఴుత్తుక్కుప్పూణొడు కాదుక్కుక్కుణ్డలముమ్
మెయ్యిడ నల్లదోర్ శాన్దముం తన్దు ఎన్నై వెళ్ళుయిరాక్కవల్ల*
పైయుడై నాగ ప్పగై క్కొడియానుక్కు ప్పల్లాణ్డు కూఱువనే. 8

ఉడుత్తుక్కళైన్ద నిౝ పీదగవాడై యుడుత్తు క్కలత్తదుణ్డు*
తొడుత్త తుఴాయ్మలర్ శూడిక్కళైన్దన శూడుమిత్తొణ్డర్గళోం*
విడుత్త దిశై క్కరుమం తిరుత్తి త్తిరువోణ త్తిరువిఴవిల్*
పడుత్త పైన్నాగణై ప్పళ్ళికొణ్డానుక్కు ప్పల్లాణ్డు కూఱుదుమే. 9

ఎన్నాళెంబెరుమాౝ ఉన్దనక్కడియోమెన్ఱె ఴుత్తుప్పట్ట
వన్నాళే* అడియోఙ్గళడిక్కుడిల్ వీడుపెత్తుయ్న్దదుకాణ్*
శెన్నాళ్ తోత్తి త్తిరుమదురై యుళ్ చిలైగునిత్తు* ఐన్దలైయ
పైన్నాగత్తలై ప్పాయ్న్దవనే! ఉన్నై ప్పల్లాణ్డు కూఱుదుమే. 10

అల్వఴ క్కొన్ఱుమిల్లా అణికోట్టియర్ కోౝ* అబిమానతుఙ్గౝ
శెల్వనై ప్పోల త్తిరుమాలే! నానుమునక్కు ప్పఴపడియేౝ*
నల్వగైయాల్ నమోనారాయణా వెన్ఱు నామం పలపరవి*
పల్వగై యాలుం పవిత్తిరనే! ఉన్నై ప్పల్లాణ్డు కూఱువనే. 11

పల్లాణ్డెన్ఱు పవిత్తిరనై ప్పరమేట్టియై* శార్ఙ్గ మెన్నుమ్
విల్లాణ్డాౝ తన్నై విల్లిపుత్తూర్ విట్టుశిత్తౝ విరుమ్బియశొల్*
నల్లాణ్డెన్ఱు నవిన్ఱురైప్పార్ నమోనారాయణాయ వెన్ఱు*
పల్లాణ్డుం పరమాత్మనై చ్చూళ్న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే. 12



## తొండరడిప్పొడియాళ్వార్ ఆనతిచ్చిన

# తిరుప్పళ్ళియెళుచ్చి

### తనియన్లు

తిరుమాలైయాణ్డాన్ ఆనతిచ్చినది

తమేవ మత్వా పరవాసుదేవం
రఙ్గేశయం రాజవదర్హణీయమ్ ।
ప్రాబోధకీం యోకృత సూక్తిమాలాం
భక్తాఙ్ఘ్రిరేణుం భగవన్తమీడే ॥

మణ్డఙ్గుడియెన్బర్ మామఱైయోర్ మన్నియశీర్*
తొణ్డరడిప్పొడి తొన్నగరం* వణ్డు
తిణర్త్తవయల్ తెన్నరఙ్గత్తమ్మానై * ప్పళ్ళి
యుణర్త్తుం పిరానుదిత్తవూర్.

శ్రీరంగనాథుని మేలుకొలుపుట.

● కదిరవన్ కుణదిశై చ్చిగరం వన్దణైన్దాన్
కనైయిరుళగన్దదు కాలైయం పొళుదాయ్*
మదువిరిన్దొళుగిన మామలరెల్లాం
వానవరరశర్గళ్ వన్దువన్దీణ్డి*
ఎదిర్దిశై నిఱైన్దనర్ ఇవరొడుమ్పుగున్ద
ఇరుఙ్గళి త్త్రీట్టముం పిడియొడుమురశుమ్*
అదిర్తలిలలైకడల్ పోన్ఱుళదు ఎఙ్గుమ్
అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే.

కొఴుఙ్గొడిమల్లైయిన్ కొఴుమలరణవి
కూర్న్దదు కుణదిశై మారుతమిదువో*
ఎఴున్దన మలరణై ప్పళ్ళికొళ్ళన్నం*
ఈన్బనినైన్ద తమిరుంశిఱగుదఱి*
విఴుఙ్గియముదలైయిన్ పిలమ్బురై పేఴ్వాయ్
వెళ్ళెయిఱుఱవదన్ విడత్తినుక్కనుఙ్గి*
అఴుఙ్గియవానైయి నరున్దుయర్ కెడుత్త
అరఙ్గత్తమ్మా! పళ్ళియెఴున్దరుళాయే. 2

శుడరొళిపరన్దన శూఴ్ దిశైయెల్లాం
తున్నియతారకై మిన్నొళిశురుఙ్గి*
పడరొళిపశుత్తనన్ పనిమదియివనో
పాయిరుళగన్ఱదు, పైమ్బొఴిల్క్కమిగిన్*
మడలిడైక్కీఱి వణ్బాళైగళ్ నాఱ
వైకఱై కూర్న్దదు మారుతమిదువో*
అడలొళితిగఴ్ తరు తిగిరియన్దడక్కై
అరఙ్గత్తమ్మా! పళ్ళియెఴున్దరుళాయే. 3

మేట్టిళమేదిగళ్ తళైవిడుమాయర్గళ్
వేయ్ఙ్గుఴలోశైయుం విడై మణిక్కురలుమ్*
ఈట్టియవిశైదిశై పరన్దనవయలుళ్
ఇరిన్దనశురుమ్బినం ఇలఙ్గైయర్కులత్తై*

నాట్టియవరిశిలై వానవ రేఱే!

మామునివేళ్వియై క్కాత్తు* అవపిరదం

ఆట్టియ వడుతిరలయోత్తి యెమ్మరశే!

అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే. 4

పులమ్బినపుట్కళుం పూమ్బొళిల్గళిన్వాయ్

పోయిత్తుక్కఙ్గుళ్ పుగున్దదుపులరి*

కలన్దదుకుణదిశై కనై కడలరవం

కళివణ్డుమిళ త్తయ కలమ్బగమ్బునైన్ద*

అలఙ్గలన్దొడైయల్ కొణ్డు అడియిణై పణివాన్

అమరర్గళ్ పుగున్దనర్ ఆదలిలమ్మా!

ఇలఙ్గైయర్కోన్ వళిపాడు శెయ్కోయిల్

ఎంబెరుమాన్! పళ్ళి యెళున్దరుళాయే. 5

ఇరవియర్ మణినెడుం తేరొడుమివరో?

ఇఱైయవర్పదినొరు విడైయరుమివరో*

మరువియమయిలిన నఱుముగనివనో?

మరుదరుం వశుక్కళుం వన్దువన్దీణ్డి*

పురవియోడాడలుం పాడలుంతేరుం

కుమరదణ్డంపుగున్దీణ్డియ వెళ్ళమ్*

అరువరైయనైయనిన్ కోయిల్మున్ఇవరో?

అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే. 6

అన్దరత్తు మరర్గళ్ కూట్టజ్ఞళివై యో?
అరున్దవమునివరుం మరుదరు మివరో?*
ఇన్దిరనానై యుం తానుం వన్దివనో?
ఎమ్బెరుమాన్! ఉనకోయలిన్ వాశల్*
శున్దరర్ నెరుక్క విచ్చాదరర్ నూక్క
ఇయక్కరుం మయజ్గినర్ తిరువడిత్తొళవాన్*
అన్దరం పారిడ మిల్లై మత్తిదువో?
అరజ్గత్తమ్మా పళ్ళియెళున్దరుళాయే. 7

వమ్బవిళ్ వానవర్ వాయుఱై వళజ్గ
మానిదికపిలై ఒణ్ కణ్ణాడిముదలా*
ఎమ్బెరుమాన్ పడిమైక్కలం కాణ్డఱ్కు
ఏఱ్పనవాయిన కొణ్డునన్మునివర్*
తుమ్బురువారదర్ పుగున్దనరివరో
తోన్ఱిన నిరవియుం తులజ్గొళిపరప్పి*
అమ్బరతలత్తిల్ నిన్ఱు అగల్గిన్ఱదిరుళ్ పోయ్
అరజ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే. 8

● ఏదమిల్ తణ్ణుమై ఎక్కం మత్తళి
యాళ్ కుళల్ ముళవమోడు ఇశై దిశై కెళుమి*
కీదజ్గళ్ పాడినర్ కిన్నరర్ గెరుడర్గళ్
కన్దరువరవర్ కజ్గులుమెల్లామ్*

మాదవర్ వానవర్ శారణరియక్కర్
శిత్తరుం మయఙ్గినర్ తిరువడిత్తొళువాన్*
ఆదలిలవర్కు నాళోలక్కమరుళ
అరఙ్గత్తమ్మా! పళ్ళియెళున్దరుళాయే. 9

● కడిమలర్ కమలఙ్గళ్ మలర్న్దన విపైయో?
కదిరవన్ కనై కడల్ ముళైత్తనివనో?*
తుడియిడైయార్ శురికుళల్ పిళిన్దుదఱి
త్తుగిలుడు త్తేఱినర్ శూళ్ పునలరఙ్గా!*
తొడై యొత్త తుళవముం కూడైయుం పొలిన్దు
తోన్ఱియ తోళ్ తొణ్డరడిప్పొడియెన్నుమ్
అడియనై* అళియనెన్ఱరుళి ఉన్నడియార్కు
ఆట్పడుత్తాయ్! పళ్ళియెళున్దరుళాయే. 10

**అడివరవు :—** కదిర్ కొళు శుడర్ మేట్టు పులంబిన ఇరవియర్ అన్తరమ్ వంబవిళ్ ఏదమ్ కడిమలర్.

తొండరడిప్పొడియాళ్వార్ తిరువడిగళే శరణమ్.

తిరుప్పళ్ళియెళుచ్చి సంపూర్ణమ్,



శ్రీ గోదాదేవ్యై నమః

# తిరుప్పావై

హేమంతమున తొలిమాసమగు మార్గశీర్షమున గోపకన్యకలు కాత్యాయనీ వ్రత మాచరింప గడగి తెల్లవారుజామున నొక్కొక్క ఇంటికి పోయి తమ చెలికత్తెల మేలుకొలిపి గుమిగూడి యమునా నదిలో మునిగి ఆ నదిగట్టున నిసుకలో కాత్యాయినీ విగ్రహమును కల్పించి పూజించి నట్లు శ్రీమద్భాగవతమున గలదు. పరమ భక్తురాలగు గోదాదేవియు తన యూరు గొల్లపల్లెగా భావించి తన చెలికత్తెల మేలుకొలిపి వ్రత మాచరింపబూనినది ఒక్కొక్క ఇంటికినిబోయి చెలుల మేలుకొలుపు విధమున 'తిరుప్పావై' పాడినది. 'పావై' యనగా కన్య. 'పావై నోంబు' అనగా కన్య లాచరించు వ్రతము. ఈ పాశురముల తుదిని 'ఎం పావాయ్' అను మకుటము కలదు గాన దీనికి 'తిరుప్పావై' యను పేరయ్యెను.

శ్లో॥ కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవాం
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥

శ్రీ పరాశరభట్టర్‌వారు శిష్యుల కోరికపై ఆండాళ్ విషయమై తిరుప్పావై యను ప్రబంధముయొక్క వాక్యార్థముగ ఈ దిగువ కనబర చిన తనియన్ ఆనతిచ్చి ఆండాళ్ విషయమై ప్రపత్తి చేసిరి.

నీళాతుఙ్గస్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతి శత శిర స్సిద్ధ మధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజనిగళితం యాబలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏవాస్తు భూయః ॥

నప్పిన్న పిరాట్టియొక్క ఉత్తుంగ వక్షస్థలమనెడు పర్వత ప్రదేశమున శయనించియున్న శ్రీకృష్ణుని, ఉపనిషత్తులయందు పేర్కొనిన శేషత్వ పారతంత్ర్యములను విన్నవించి, మేల్కొలిపి, తాను ధరించి విడిచిన మాలికచే బద్ధునిగ చేసి బలాత్కారముగ సర్వేశ్వరుని ఏ గోదాదేవి అనుభవించినదో అట్టి ప్రభావముగల ఆండాళ్ కొరకు మాటిమాటికి ప్రణామములు సమర్పించుచున్నాను.

శ్రీ గోదాదేవి ప్రసాదించిన దివ్యప్రబంధమునకు ఈ మె తిరునామమే మొదట అనుసన్ధింపదగినదియని తమ మనస్సుకు ఉయ్యక్కొండార్లు ఆనతిచ్చుచున్నారు.

అన్నవయల్ పుదువై యాణ్డాళ్ అరఙ్గఱ్కు
పన్ను తిరుప్పావై పల్ పదియం—ఇన్నిశైయాల్
పాడికొడుత్తాళ్ నఱ్పామాలై పూమాలై
శూడికొడుత్తాళై చ్చొల్లు

ఓ మనసా! హంసలచే నలంకృతమైన శ్రీవిల్లిపుత్తూరిలో అవతరించినవారును, శ్రీరంగనాథుల విషయమున శ్రావ్యమైన పాశురములతో గూర్చిన మాలికయగు తిరుప్పావై యను ప్రబంధమును గానముచేసి యొసంగినవారును పుష్పమాలికను కొప్పున ముడుచుకొని సమర్పించిన వారును అగు శ్రీ గోదాదేవిని స్తోత్రము చేయుమా!

తిరువేంగడముడై యాౝ (శ్రీ వేంకటేశ్వరస్వామి) వారియఖ్యం గోదాదేవి అనుసరించిన రీతిని తమకున్ను వర్తింపజేయుమని ప్రార్థించు చున్నారు.

శూడికొ్కడుత్త శుడర్కొ్కడియే! తొల్ పావై
పాడి యరుళవల్ల పల్వళై యాయ్!—నాడి నీ
వేఙ్గడ వఱ్కెన్నై విది యెన్ఱవిమ్మాత్తమ్
నాఙ్గడవా వణ్ణమే నల్గు.

శ్రీరంగనాధునికి ముడుచుకొన్న పుష్పమాలికలను సమర్పించిన స్వర్ణ లతాంగీ! అనాదియగు తిరుప్పావై ప్రబంధమును దివ్యజ్ఞాన సామర్థ్యము లచే పాడి కృపచేసిన, బహువిధ హస్తాభరణములు గలదానా! తిరువేంగడ ముడై యానుని పెండ్లి చేసుకొనుటకై నీవు ప్రార్థించిన విధముగ దాసుల మగు మేము ఆ స్వామి సేవకు అనువర్తించునట్లు కృపచేయవలయును.

---

● ఈ గుర్తు గలిగిన పాశురముల 2 పర్యాయములు అనుసంధించ వలెను.

అవతారిక : వత్రిమునకు తగినకాలము, వ్రతముచేయు యోగ్యత కల వారిని, ఆ వ్రతమును పూర్తి చేయజాలిన శ్రీ కృష్ణుని ప్రశంసించి గోపికలు వ్రతమునకు సంకల్పించిరి.

మార్గళిత్తిజ్గళ్ మదినిఱైన్ద నన్నాళాల్
నీరాడ ప్పోదువీర్! పోదుమినో నేరిళై యీర్
శీర్మల్గుమాయ్ప్పాడి శెల్వచ్చిఱుమీర్ కాళ్!
కూర్వేల్కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్
ఏరార్న్దకణ్ణి యశోదై యిళంశిజ్గమ్
కార్మేని చ్చెజ్గణ్ కదిర్ మది యమ్బోల్ ముగత్తాన్
నారాయణనే నమక్కే పఱై తఱువాన్
పారోర్ పుగళ ప్పడిన్దేలో రెమ్బావాయ్. ౧

ఇది మార్గశీర్ష మాసము. వెన్నెలనిండిన పూర్ణిమరోజు అందమైన ఆభరణములుగల పడుచులారా! ఐశ్వర్యముతో నిండిన వ్రేపల్లెలో సంపదలతో తులతూగుచున్న ఓ బాలికలారా! ఈమార్గశీర్ష స్నానము చేయవలెనని సంకల్పమున్నచో రండు. ముందు నడువుడు. వాడియగు వేలాయుధము దాల్చి కృష్ణునకు ఎలాంటి ఆపద రాకుండ కాపాడుచున్న శ్రీ నందగోపుల కుమారుడును, అందములగు నయనములతో అలరారుచున్న యశోదయొక్క బాలసింహమును, నీలమేఘశ్యాముడును ఎఱ్ఱతామరలవోలు కన్నులు కలవాడును సూర్యచంద్రులవోలె దివ్య ముఖమండలము కలవాడును అయిన నారాయణుడే మన మపేక్షించిన వ్రతసాధనమగు 'పర' అను వాద్యమును ఈయనున్నాడు. లోకులందరు సంతసించునట్లు మీరందరు ఈ వ్రతములో చేరుడు.

అవ : వ్రతమునకు అంగముగా చేయవలసిన వానిని విడువవలసిన వానిని పేర్కొనిరి.

వైయత్తువాళ్ వీర్ గాళ్ ! నాముం నమ్బావైక్కు
శెయ్యుం కిరిశైగళ్ కేళీరో పాఱ్కడలుళ్
పైయత్తుయిన్ఱ పరమనడిపాడి
నెయ్యుణ్ణోం పాలుణ్ణోం నాట్కాలే నీరాడి
మైయిట్టెళుదోం మలరిట్టు నాముడయోమ్
శెయ్యాదన శెయ్యోం తీక్కుఱళై చ్చెన్ఱోదోమ్
ఐయముమ్పిచ్చైయుం ఆన్దనైయుమ్ కైకాట్టి
ఉయ్యుమాఱెణ్ణి ఉగన్దేలో రెమ్బావాయ్. ౨

కృష్ణుడవతరించిన కాలములో ఈ లోకములో పుట్టి దుఃఖమయ మగు ఈ ప్రపంచములో కూడ ఆనందమునే అనుభవించుచున్న వారరాలా, మేము మా వ్రతమునకుచేయు క్రియా కలాపము వినుడు.

పాలసముద్రములో ధ్వని కాకుండ మెల్లగా పండుకొనియున్న ఆ పరమపురుషుని పాదములకు మంగళము పాడెదము. ఈ వ్రత సమయములో నేతినిగాని, పాలనుగాని మేమారగింపము. తెల్లవారుజాముననే లేచి స్నానము చేసెదము కంటికి కాటుక పెట్టుకొనము. కొప్పులో పూవులు ముడువము. మా పెద్దలు ఆచరింపని పనుల నాచరింపము. ఇతరులకు బాధ కలిగించు మాటలను, అసత్య వాక్యములను, ఎచ్చటను పలుకము. జ్ఞానాధికులను అధిక ధన ధాన్యాదులతో సత్కరింతుము. భిక్షల నొసంగుదుము. మేము ఉజ్జీవించు విధమునే విచారించెదము. దీనిని విని మీరానందింప కోరుచున్నాము.

అవ తమకు వ్రతము చేయుటకు అనుమతినిచ్చిన యూరిలోనివారు సంతుష్టులగునట్లు వర్షముపడి గోసస్య సమృద్ధి కావలెనని కోరిరి

● ఓఙ్గి యులగళన్ద వుత్తమన్ పేర్‌పాడి
నాఙ్గళ్ నమ్పావైక్కు చ్చాత్తి నీరాడినాల్
తీఙ్గిన్ఱి నాడెల్లాం తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు
ఓఙ్గు పెరుఞ్జెన్నె లూడు కయలుగళ
పూఙ్గువళై ప్పోదిల్ పొరివణ్డు కణ్బడుప్ప
తేఙ్గాదే పుక్కిరిన్దు శీర్‌త్త ములై పత్తి
వాఙ్గ, కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్పశుక్కళ్
నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దేలో రెమ్పావాయ్. 3

బలిచక్రవర్తి యిచ్చిన దానమునంది ఆకాశము వరకు మూడు లోకములను తన పాదములచే కొలిచిన పురుషోత్తముడగు త్రివిక్రముని దివ్యనామములను గానముచేసి మేము మా వ్రతమనెడి మిషతో స్నానము చేయగనే దేశమంతయు నెలకు మూడు వానలు పడి ఈతిబాధలు లేక సుఖముగా ఉండవలెను. ఆకాశము వరకు పెరిగిన వరిచేలలో చేపలు త్రుళ్ళిపడుచుండగా, కలువపూలలో మనోహరములగు తుమ్మెదలు నిద్రించుచుండగా, సస్యములు సమృద్ధములై యుండవలెను. పాలు పితుకుటకు కొట్టములోదూరి స్థిరముగా కూర్చుండి పొదుగునంటగనే పాలకుండలు నిండునట్లు చేపుగోవులు సమృద్ధిగా నుండవలెను. నశ్వరముకాని సంపద దేశమంతా నిండవలెను.

అవ : లౌకికాభివృద్ధికి సాధనమగు వర్షము నొసంగుటకు వర్షాధి దేవత నాహ్వానించి ఎట్లు వర్షించవలెనో నియమించిరి.

ఆళిమళై క్కణ్ణా! ఒన్ఱు నీకై కరవేల్
ఆళియుళ్ పుక్కు- ముగన్దుకొడార్త్తేఱి
ఊళి ముదల్వనురువంబోల్ మెయ్కఱుత్తు
పాళియన్దోళుడై పద్మనాబన్ కైయిల్
ఆళిపోల్ మిన్ని, వలమ్బురిపోల్ నిన్ఱదిర్న్దు
తాళాదే శార్ఙ్గ ముదైత్త శరమళై పోల్
వాళ వులగినిల్ పెయ్దిడాయ్ నాఙ్గళుమ్
మార్గళి నీరాడ మగిళ్న్దేలోరెమ్బావాయ్. ४

ఓ పర్జన్యదేవా! నీవు దాతృత్వములో చూపు ఔదార్యమును ఏ మాత్రమును సంకోచింప జేయకుము. గంభీరమగు సముద్రములో మధ్యకుపోయి ఆ సముద్ర జలమునంతను నీవు పూర్తిగా త్రాగి గర్జించి ఆకాశమున వ్యాపించి సర్వ జగత్కారణ భూతుడగు శ్రీమన్నారాయణుని దివ్య విగ్రహమువలె శ్యామలమూర్తివై ఆ పద్మనాభుని విశాల సుందర బాహు యుగళిలో దక్షిణ బాహువునందలి చక్రమువలె మెరసి ఎడమ చేతిలోని శంఖమువలె ఉరిమి శార్ఙ్గమను ధనస్సునుండి విడిచిన బాణముల వర్షమా అనునట్లు లోకమంతయు సుఖించునట్లు మేము సంతోషముతో మార్గశీర్ష స్నానము చేయునట్లు వర్షింపుము.

అవ : తామారంభించిన వ్రతమునకు ప్రతిబంధకములగు పాపము లన్నియు నామసంకీర్తన మొనర్చి ఈ వ్రతమునకు ప్రక్రమింపగనే నశించుననిరి. తరువాత వ్రతమునకు బయలుదేరిరి.

మాయనై మన్ను వడమదురై మైన్దనై
తూయ పెరునీర్ యమునైత్తుఱైవనై
ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ మణివిళక్కై
తాయై క్కుడల్విళక్కమ్ శెయ్ద దామోదరనై
తూయోమాయ్ వన్దు నాం తూమలర్ తూవిత్తొళుదు
వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క
పోయపిళ్ళైయుం పుగుతరువానిన్ఱనవుమ్
తీయినిల్ తూశాగుం శెప్పేలో రెమ్బావాయ్. ౫

ఆశ్చర్యకరములగు చేష్టలు కలవాడును నిత్యము భగవత్సంబంధముగల ఉత్తరదేశమందలి మధురానగరికి నిర్వాహకుడును, పవిత్రము అగాధమగు జలముగల యమునానది రేవే తనకు గురుతుగా కలవాడును, గోపవంశమున ప్రకాశించిన మంగళదీపము అయినవాడును, తల్లి యశోద గర్భమును ప్రకాశింపచేయునటుల త్రాడుచే కట్టబడి దామోదరుడైనవాడును అగు, కృష్ణభగవానుని వద్దకు పవిత్రులమైవచ్చి మనము పరిశుద్ధములగు పుష్పములతో నర్చించి అంజలి ఘటించి వాక్కుతో కీర్తించి మనసార ధ్యానించినచో మన పూర్వసంబంధ పాపరాశియు ఆగామి పాపరాశియు అగ్నిలో పడిన దూదివలె భస్మమైపోవును. కావున భగవానుని నామములు పాడుడు.

అవ : భగవద్విషయమున ప్రాతికూల్యము వదిలి క్రొత్తగా ప్రవేశించిన గోపిక మొదలు భాగవత సహవాసములేనిదే జీవించలేననెడి గోపికవరకు పదిమందిని మేల్కొల్పి తమ గోష్ఠిలో జేర్చుకొనిరి.

పుళ్ళుం శిలమ్బినకాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్
వెళ్ళైవిళిశజ్గిన్ పేరరవం కేట్టిలైయో?
పిళ్ళాయ్ ఎళున్దిరాయ్ పేయ్ ములై నఞ్జుణ్డు
కళ్ళచ్చగడం కలక్కళియ క్కాలోచ్చి
వెళ్ళత్తరవిల్ తుయిలమర్న్ద విత్తినై
ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్గళుం యోగిగళుమ్
మెళ్ళ వెళున్దు అరియెన్ఱ పేరరవమ్
ఉళ్ళం పుగున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్. ౬

భగవదనుభవము క్రొత్తదగుటచే ఈ వ్రతముయొక్క వైభవము తెలియక తానొక్కతెయే తన భవనములో పరుండి వెలికిరాకయున్న ఒక ముగ్ధను లేపుచున్నారు.

ఆహారము నార్జించుకొనుటకై లేచి పక్షులు కలకలలాడుచు పోవుచున్నవి. ఆ పక్షులకు నాయకుడైన గరుత్మంతునకు స్వామియగు శ్రీ మహావిష్ణువు ఆలయములో తెల్లని శంఖము, సమయమైనదని, సేవలకు రండని పెద్ద ధ్వని చేయుచున్నది. ఆ ధ్వని వినుటలేదా? ఓపిల్లా! లెమ్ము మేము ఎవరు లేపగా లేచితిమన్న సందేహము కలుగవచ్చును. పూతన స్తనములందుండు విషము నారగించినవాడును. అసురావేశము కలిగి చంపనుద్యమించిన కృత్రిమ శకటమును కీలూడునట్లు పాలకై ఏడ్చి కాలుచాచి పొడిపొడియగునట్లు చేసినవాడును, క్షీరసాగరమున నల్లని మెత్తని సుకుమారమైన శేషశయ్యపై లోకరక్షణ చింతతో యోగనిద్ర నమరియున్న జగత్కారణభూతుడునగు ఆ సర్వేశ్వరుని, తమ హృదయముల పదిలపరచుకొని మెల్లగాలేచుచున్న మునులను యోగులను హరి- హరియనుచుండునపుడు వెడలిన పెద్ద ధ్వని మా హృదయములలో చొచ్చి చల్లబరచి, మమ్ములను మేల్కొల్పినది. నీవుకూడ లేచిరమ్ము.

అవ : వ్రతారంభముచేసి ఈ పాశురమున శ్రవణములోని వైవిధ్యమును వివరించుచు వేరొక గోపికను మేల్కొలుపుచున్నారు

కీశు కీశెన్ఱెజ్గుం ఆనై చ్చాత్తం కలన్దు
పేసిన పేచ్చరవం కేట్టిలై యో ప్పేయ్ ప్పేణ్ణే!
కాశుం పిఱప్పుం కలగలప్ప క్కై పేర్త్తు
వాశ నఱుజ్కుళలాయ్చ్చియర్. మత్తినాల్
ఓశై పడుత్త తయిరరవం కేట్టిలైయో?
నాయగ ప్పెణ్పిళ్ళాయ్! నారాయణన్ మూర్తి
కేశవనై ప్పాడవుం నీకేట్టే కిడ త్తియో
తేశ ముడైయామ్ తిఱవేలో రెమ్బావాయ్. ౭

భరద్వాజ పక్షులు పగలు విడిపోదుము కదాయని తెల్లవారుజామున కలిసికొని అన్నివైపులా ఏవేవో మాటలాడుకొనుచున్నవి. ఆ మాటల లోని ధ్వనినైననూ నీవు వినలేదా!

ఓ పిచ్చిదానా! కుసుమమాలాలంకృతములగు కేశబంధములు వీడుటచే సుగంధములను వెదజల్లుచున్న జుట్టుముడులుగల గోపికలు, కవ్వములతో పెరుగు చిలుకునపుడు, వారి చేతుల కంకణ ధ్వనులు, మెడలోని ఆభరణ ధ్వనులతో కలిసి విజృంభించి ఆకాశమునంటుచున్నవి. ఆ ధ్వనిని వినలేదా? ఓ నాయకురాలా! సర్వ పదార్థములలో వాత్సల్యముతో వ్యాపించియుండి మనకు కన్పడవలెనని మూర్తిమంతుడై కృష్ణుడుగా అవతరించి విరోధులను నశింపజేసిన ప్రభువును కీర్తించుచుండగా విని యును, నీవు పరుండియుంటివా? నీ తేజస్సు మాకు కన్పట్టుచున్నది. దీని నడ్డగింపక మేము దర్శించి యనుభవించునట్లు తలుపు తెరవ వలయును.

అవ : వెనుకటి రెండు పాశురములలో శ్రవణము జరుగు క్రమమును నిరూపించి ఈ పాశురములో మననము చేయుటచే కలుగు శబ్ద మును నిరూపించుచున్నారు.

కీళ్ వానం వెళ్లెన్ఱు ఎరుమై శిఱువీడు
మేయ్వాన్ పరన్దనకాణ్ మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్
పోవాన్ పోగిన్ఱారై ప్పోగామల్ కాత్తు ఉన్నై
కూవువాన్ వన్దునిన్ఱోమ్, కోదుకలముడైయ
పావాయ్ ఎళున్దిరాయ్ పాడిప్పఱై కొణ్డు
మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ
దేవాది దేవనై చ్చెన్ఱు నాం శేవిత్తాల్
ఆవా వెన్ఱారాయ్న్దరుళేలోరెమ్బావాయ్. ా

తూర్పుదిక్కు తెలవారుచున్నది. చిన్న బీడులోనికి మేయుటకు విడువబడిన గేదెలు విచ్చలవిడిగా పోవుచున్నవి. మిగిలిన పిల్లలందరును గూడ వ్రతస్థలమునకు పోవుటకై బయలుదేరి అట్లు పోవుటయే తమకు ప్రయోజనమనునట్లు పోవుచున్నారు. ఆ పోవువారిని ఆపి మేము నిన్ను పిలుచుటకు నీ వాకిట వచ్చి నిలచినాము. కుతూహలము కలదానా- ఓ పడుచా! లేచిరమ్మ! కృష్ణ గుణములను కీర్తించి వ్రతమున కుపక్ర మించి వ్రతసాధనమగు పరనుపొంది కేశియను రాక్షసుని చీల్చి చంపిన వానిని, మల్లురను మట్టుపెట్టిన వానిని, దేవతలకు ఆదిదేవుడైన వానిని మనము పోయి సేవించినచో అయ్యో అయ్యో మీరే వచ్చితిరేయని బాధపడి మన మంచిచెడ్డలను విచారించి మనలను కటాక్షించును.

అవ : ఈ పాశురమునుండీ నాలుగు పాశురములలో ధ్యానదశ వివరింప బడుచున్నది. అట్టి ధ్యానములో పరాకాష్ఠనందియున్న గోపిక ఈ పాశురమున మేల్కొలుపబడుచున్నది.

తూమణి మాడత్తు చ్చుట్రుం విళక్కెరియ
తూపం కమళ త్తుయిలణై మేల్ కణ్వళరుమ్
మామాన్ మగళే! మణిక్కదవం తాళ్ తిఱవాయ్
మామీర్! అవళై యెళుప్పీరో? ఉన్ మగళ్ తాన్
ఊమైయో అన్ఱి చ్చెవిడో? అనన్దలో?
ఏమప్పెరున్దుయిల్ మన్దిర ప్పట్టాళో?
మామాయన్ మాదవన్ వైకున్ద నెన్ఱెన్ఱు
నామం పలవుం నవిన్ఱేలో రెమ్బావాయ్.

పరిశుద్ధములగు నవ విధమణులతో నిర్మించబడిన మేడలో సుఖ శయ్యపై చుట్టును దీపములు వెలుగుచుండగా అగరు ధూపము గుమగుమ లాడుచుండగా నిద్రపోవుచున్న ఓ అత్త కూతురా! మణికవాటపు గడియ తెరువుము. ఓయత్తా నీవైనను ఆమెను లేపుము. నీ కుమార్తె మూగదా? లేక చెవిటిదా? లేక జాడ్యము కలదా? లేక ఎవరైన కదిలిన చెప్పుమని కావలి యున్నారా? లేక గాఢనిద్ర పట్టునట్లు మంత్రించినారా? ఓ మహా మాయావీ! ఓ మాధవా! ఓ వైకుంఠవాసా! అని అనేక నామములను కీర్తించి ఆమె లేచునట్లు చేయుము

అవ : పారతంత్ర్య పరాకాష్ఠలో గాఢనిద్రలో మునిగియున్న కృష్ణుని పొరుగింటి పిల్లను ఈ పాశురమున మేల్కొలుపుచున్నారు.

నోత్తుచ్చువర్క్కం పుగుగిన్ద అమ్మనాయ్
మాత్తముమ్ తారారో వాశల్ తిఱవాదార్
నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్ నమ్మాల్
పోత్తప్పఱై తరుం పుణ్ణియనాల్ పణ్డొరునాల్
కూత్తత్తిన్ వాయ్‌వీళ్‌న్ద కుమ్బకరణనుమ్
తోత్తుం ఉనక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో?
ఆత్తవనన్దలుడైయాయ్! అరుఙ్గలమే!
తేత్తమాయ్‌వన్దు తిఱవేలోరెమ్బావాయ్. ౧౦

మేము రాక ముందే నోమునోచి దాని ఫలముగ సుఖానుభవమును పొందిన తల్లీ! తలుపు తెరువక పోయిన పోదువుగాక! మాటలనైనను పలుకవా! పరిమళముతో నిండిన తులసిమాలలు అలంకరించుకొనిన కిరీటముగల నారాయణుడు. ఏమియులేని మా వంటి వారము మంగళము పాడినను 'పఱ' అను పురుషార్థమును ఒసంగెడి పుణ్యమూర్తి. ఒకనాడు కుంభకర్ణుని మృత్యువు నోటిలో పడత్రోయగా, ఆ కుంభకర్ణుడు నిద్రలో నీచే ఓడింపబడి తన సొత్తగు ఈ గాఢనిద్ర నీకు ఒసంగినాడా? ఇంత అధికమగు నిద్రమత్తు వదలని ఓ తల్లీ! మా కందరకు శిరోభూషణమైన దానా! నిద్ర నుండి లేచి మైకము వదిలించుకొని, తేరుకొనివచ్చి తలుపు తెఱువుము. నీనోరుతెరచి మాటాడుము ఆవరణము తొలగించి నీ దర్శనము నిమ్ము.

అవ : భగవదనుభవమున పరిపూర్ణురాలై తన దివ్యమంగళ విగ్రహ దర్శనముచేతనే వీరిని ఆనందింప చేయజాలినదై యున్న గోపికను ఈ పాశురమున మేల్కొలుపుచున్నారు.

కత్తుక్కరవై క్కణఙ్గళ్ పలకఱన్దు
శెత్తార్ తిరలళియ చ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్
కుత్త మొన్ఱిల్లాద కోవలర్తం పొఱ్కొడియే!
పుత్తరవల్ గుల్ పునమయిలే! పోదరాయ్
శుత్తత్తుత్తోళిమా రెల్లారుంవన్దు నిన్
ముత్తం పుగున్దు ముగిల్వణ్ణన్ పేర్పాడ
శిత్తాదే పేశాదే శెల్వప్పెండాట్టి! నీ
ఎత్తుక్కు ఉఱంగుం పొరుళేలోరెమ్బావాయ్. ౧౧

లేగదూడలు గలవియు దూడలవలె నున్నవియునగు ఆవులమందల నెన్నింటినో పాలు పితుక గలవారును, శత్రువులను ఎదిరించి బలముతో యుద్ధము చేయగలవారును, ఏ విధమగు దోషము లేనివారును అగు గోపాలకుల వంశమున మొలచిన ఓ బంగారుతీగా! పుట్టలోని పాము పడగవలె నున్న నితంబ ప్రదేశము గలదానా! అడవిలోని నెమలివలె అందమైన కేశపాశముతో ఒప్పుచున్నదానా! రమ్ము చుట్టములును, చెలికత్తెలును మొదలుగ అందరును వచ్చిరి. నీ ముంగిట చేరిరి. నీలమేఘ వర్ణుడగు శ్రీకృష్ణుని నామమును కీర్తించుచుండిరి. కీర్తించుచున్నను నీవు ఉలుకక పలుకక ఉన్నావేమి? ఓ సంపన్నురాలా! నీ నిద్రకు అర్థమేమో తెలుపుము.

అవ : భగవత్కైంకర్యనిష్ఠ, ఇంద్రియ ప్రవృత్తి నిరోధముగల గోపా లుని సోదరిని ఇందు మేల్కొలుపుచున్నారు.

కనైత్తిళంకత్తెరుమై క్కన్ఱుక్కిఱంగి
నినైత్తు ములై వళియే నిన్ఱు పాల్శోర
ననైత్తిల్లం శేఱాక్కుం నఱ్చెల్వన్ తఙ్గాయ్
పనిత్తలై వీళ నిన్ వాశల్ కడై పత్తి
శినత్తినాల్ తెన్నిలఙ్గైక్కోమానై చ్చెత్త
మనత్తుక్కినియానై ప్పాడవుం నీ వాయ్తిఱవాయ్
ఇనిత్తాన్ ఎళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్!
అనైత్తిల్లత్తారుమ్ అఱిన్దేలోరెమ్బావాయ్. ౧౨

లేగదూడలుగల గేదెలు పాలుపితుకువారు లేక లేగదూడలను తలంచుకొని వానిపై మనసుపోవుటచే ఆ దూడనే వచ్చి పొదుగులో మూతిపెట్టినట్లు తోచి పాలు పొదుగునుండి కారిపోవుటచే యిల్లంతయు బురదయగుచున్న యొకానొక మహైశ్వర్య సంపన్నుని చెల్లెలా! మంచు తలపై పడుచుండ నీవాకిట నిలిచి యుంటిమి. కోపముతో దక్షిణ దిక్కున నున్న లంకకు అధిపతియైన రావణుని చంపిన మనోభిరాముడగు శ్రీరాముని గానము చేయుచుంటిమి. అది వినియైనను నీవు నోరు విప్పవా! ఇంక మమ్మేలుకొనవా! ఏమి యీ గాఢనిద్ర ఊరివారికందరకును నీ విషయము తెలిసిపోయినది. లెమ్ము అని కృష్ణుని విడువక సర్వకాలముల నుండుటచే స్వధర్మమునుకూడ చేయలేని దశయందున్న ఐశ్వర్యసంపన్నుడగు ఒక గోపాలుని చెల్లెలిని మేల్కొల్పినారు.

అవ : నేత్ర సౌందర్యము విశిష్ట స్థానమునాక్రమించి శ్రీకృష్ణుడే తన కొరకు వెదుకుకొని రాక యెట్లుండగలడు అను దృఢమైన అధ్యవసాయముగల గోపికను ఈ పాశురమున మేల్కొలుపుచున్నారు.

పుళ్ళిన్ వాయ్‌క్కీణ్డానై పొల్లా అరక్కనై
క్కిళ్ళిక్కళైన్దానై క్కీర్త్తి మై పాడిప్పోయ్
పిళ్ళైగళెల్లారుం పావైక్కళం బుక్కార్
వెళ్ళి యెళున్దు వియాళ ముఱఙ్గిత్తు
పుళ్ళుంశిలమ్బినగాణ్ పోదరి క్కణ్ణినాయ్
కుళ్ళక్కుళిర కుడైన్దు నీరాడాదే
పళ్ళిక్కిడత్తియో పావాయ్ నీ నన్నాళాల్
కళ్ళన్దవిర్న్దు కలన్దేలో రెమ్బావాయ్. ౧౩

బకాసురుని నోరు చీల్చి తన్ను కాపాడుకొని మనను కాపాడిన శ్రీకృష్ణుని, దుష్ట రాక్షసుడగు రావణుడు పదితలలను హేలగా చిగుళ్ళు త్రుంపినట్లు త్రుంపి పారవేసిన శ్రీరాముని గానము చేయుచుపోయి మన తోడిపిల్లలందరును వ్రతక్షేత్రమును చేరినారు లోన తుమ్మెదగల తామర పూవులను బోలిన కన్నులు గలదానా! లేడివంటి చూపులు గలదానా! శుక్రుడు ఉదయించుచున్నాడు. గురుడస్తమించుచున్నాడు. పక్షులు కూయుచున్నవి. కృష్ణ విరహతాపము తీరునట్లు చల్లగా అవగాహన మొనర్చి స్నానమొనర్చక పాన్పుపై పండుకొని యుండెదవేల? ఓ సుకుమార స్వభావా! ఈ మంచిరోజున నీవు నీ కపటమును వీడి మాతో కలసి ఆనందము ననుభవింపుము.

అవ : పరమాత్మనేగాక పరమాత్మయందలి గుణములను గూడ ఉపాసన చేసి పూర్ణురాల ఖ తమ సంఘమునకంతకు నాయకురాలై నడిపింప శక్తిగల గోపికను ఈ పాశురమున మేల్కొలుపుచున్నారు.

ఉఙ్గళ్ పుళైక్కడై త్తోట్టత్తు వావియుళ్
శెఙ్గళునీర్ వాయ్ నెగిళ్న్దు ఆమ్బల్వాయ్ కూమ్బినగాణ్
శెఙ్గల్ పొడిక్కూఱై వెణ్ పల్ తవత్తవర్
తఙ్గళ్ తిరుక్కోయిల్ శఙ్గిడువాన్ పోగిన్రార్
ఎఙ్గళై మున్నం ఎళుప్పువాన్ వాయ్ పేశుమ్!
నఙ్గాయ్! ఎళున్దిరాయ్ నాణాదాయ్! నావుడై యాయ్!
శఙ్గొడుశక్కరం ఏన్దుం తడక్కైయన్
పఙ్గయక్కణ్ణానైప్పాడేలోరెమ్బావాయ్. ౧౪

ఓ పరిపూర్ణురాలా! నీపెరటితోటలో దిగుడు బావిలోని ఎఱ్ఱ తామరలు వికసించినవి. నల్లకలువలు ముడుచుకొని పోవుచున్నవి లెమ్మ ఎఱ్ఱని కాషాయములను దాల్చి తెల్లని పలువరుస గలిగి వైరాగ్యముతో కూడిన సన్యాసులు తమతమ యాలయములలో ఆరాధన మొనర్చుటకై పోవుచున్నారు లెమ్మ, మమ్మలను ముందుగనే మేల్కొనివచ్చి లేపుదు నని మాటనిచ్చినావు మరచితివా! ఓ లజ్జావిహీనురాలా! లెమ్మ ఓమాట నేర్పుగలదానా! శంఖమును, చక్రమును ధరించినవాడును, ఆజానుబాహువును అయిన పుండరీకాక్షుని మహిమను గానము చేయుటకు లేచిరమ్మ.

అవ : అహంకారము తొలగించుకొని ఆచార్య సమాశ్రయణముచే మంత్రము లభించి భగదనుభవముచే పరిపూర్ణ స్థితి నందియున్న గోపికను ఈ పాశురమున మేల్కొలుపుచున్నారు.

ఎల్లే! ఇళఙ్గిళియే! యిన్నం ఉఱఙ్గుదియో!
శిల్లెన్ఱళై యేన్మిన్! నఙ్గైమీర్! పోదరుగిన్ఱేన్
వల్లై ఉన్ కట్టురైగళ్ పణ్డే ఉన్ వాయఱిదుమ్
వల్లీర్గళ్ నీఙ్గళే నానేదా నాయిడుగ
ఒల్లై నీ పోదాయ్ ఉనక్కెన్న వేఱుడైయై
ఎల్లారుం పోన్దారో? పోన్దార్ పోన్దెణ్ణిక్కొళ్
వల్లానై కొన్ఱానై మాత్తారై మాత్తళిక్క
వల్లానై మాయనై ప్పాడేలో రెమ్బావాయ్. ౧౫

ఈ పాశురములో లోనున్న గోపికకు బయటి గోపికలకు సంవాదము :

బ॥గోపికలు: ఓ లేత చిలుకవంటి కంఠమాధుర్యము కలదానా! ఇంకను నిద్రించుచున్నావా! అయ్యో ఇది ఏమి?

లోనిగోపిక : పూర్ణులగు గోపికలారా! చికాకు కలుగునట్లు జిల్లుమని పిలువకుడు, నేనిదే వచ్చుచున్నాను.

బ॥గోపికలు: నీవు చాల నేర్పుగలదానవు. నీ మాటలలోని నైపుణ్య మును కాఠిన్యమును మేమింతకు ముందే యెరుగుదుము.

లోనిగోపిక: మీరు నేర్పుగలవారలు. పోనిండు నేనే కఠినురాలను.

బ॥గోపికలు నీకీ ప్రత్యేకత ఏమి? ఏకాంతముగ నుండెదవేల? వేగ ముగ వెలికిరమ్ము.

లోనిగోపిక : అందరు గోపికలు వచ్చినారా?

బ॥గోపికలు: వచ్చిరి, నీవు వచ్చి లెక్కించుకొనుము.

లోనిగోపిక : సరే! నేనువచ్చి ఏమిచేయవలెను?

బ॥గోపికలు: బలిష్ఠమగు కువలయాపీడమను ఏనుగును చంపినవాడును, శత్రువుల దర్పమును అణచినవాడును, మాయావియు యగు శ్రీకృష్ణుని కీర్తిగానము చేయుటకు రమ్ము.

అవ : గోపికా సంఘముతో కలిసి నందగోప భవనముచేరి క్రమమును తప్పక భవనపాలకుని ద్వారపాలకుని ఈ పాశురమున అర్థించి లోనికి ప్రవేశించుచున్నారు.

● నాయకనాయ్ నిన్ఱ నన్దగోపనుడైయ
కోయిల్ కాప్పానే! కొడిత్తోన్ఱుమ్ తోరణ
వాశల్ కాప్పానే మణిక్కదవన్తాళ్ తిఱవాయ్
ఆయర్ శిఱుమియరోముక్కు అఱై పఱై
మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్నేర్న్దాన్
తూయోమాయ్ వన్దోం తుయిలెళప్పాడువాన్
వాయాల్ మున్నమున్నం మాత్తాదేయమ్మా! నీ
నేశ నిలై కరదం నీక్కేలో రెమ్బావాయ్. ౧౬

నందగోపుని భవనమును కాపాడు భవనపాలకా! లోనికి విడువుము జెండాతో ఒప్పుచున్న తోరణములతో శోభించుచున్న ద్వారమును కాపాడు ద్వారపాలకా! మణులచే సుందరమైన తలుపుల గడియను తెరవుము. గోపబాలికలమగు మాకు మాయావియు, మణివర్ణుడును అగు శ్రీకృష్ణ పరమాత్మ, ధ్వనిచేయు 'పఱ' అను వాద్యమును ఇచ్చెదనని నిన్ననే మాట యిచ్చెను. మేము వేరొక ప్రయోజనమును కాంక్షించి వచ్చిన వారముకాము. పరిశుద్ధభావముతో వచ్చితిమి శ్రీకృష్ణుని మేల్కొల్పుటకు గానము చేయవచ్చితిమి స్వామి! ముందుగనే నీవు కాదనకుము దగ్గరగా ప్రేమతో ఒకదానికొకటిచేరి బిగువుతో నిలిచియున్న తలుపులను నీవే తెరచి మమ్ములను లోనికి పోనీయవలెను. అని గోపికలు భవనపాలకుని ద్వారపాలకుని అర్థించిరి.

అవ : ఆచార్య సమాశ్రయణముచే మంత్రమును మంత్రార్థమగు సర్వేశ్వరుని ఎరింగి ఆ సర్వేశ్వరుని ప్రేమించిన భాగవతుల నాశ్రయించుటచే భగవానుడనుగ్రహించునని తెలిసికొని ఈ పాశురమున నందగోపుని, యశోదను, శ్రీకృష్ణుని, బలరాముని మేల్కొలుపుచున్నారు.

అమ్బరమే తణ్ణీరే శోఱేయఱుమ్శెయ్యుమ్
ఎమ్బెరుమాన్! నన్దగోపాలా! ఎళున్దిరాయ్
కొమ్బనార్కెల్లామ్ కొళున్దే! కులవిళక్కే
ఎమ్బెరుమాట్టి యశోదాయ్ అఱివుఱాయ్
అమ్బర మూడఱుత్తోఙ్గి యులకళన్ద
ఉమ్బర్ కోమానే! ఉఱఙ్గా దెళున్దిరాయ్
శెమ్పొర్కళలడి చ్చెల్వా! బలదేవా!
ఉమ్బియుం నీయుం ఉఱఙ్గేలో రెమ్బావాయ్. ౧౭

వస్త్రములు కావలసినవారికి వస్త్రములు, మంచినీరు కావలసినవారికి మంచినీరు, అన్నము కావలసినవారికి అన్నము ఫలాకాంక్ష లేక ధర్మబుద్ధితో దానముచేయు నందగోపాలా! మా స్వామీ! మేల్కొనుము. ప్రబ్బలిచెట్లవలె సుకుమారులగు శరీరములుగల స్త్రీలలో చిగురువంటిదానా! మా వంశమునకు మంగళ దీపము వంటిదానా! మా స్వామినీ, యశోదా! మేల్కొనుము. ఆకాశ మధ్య భాగమును చీల్చుకొని పెరిగి లోకముల నన్నిటిని కొలిచిన త్రివిక్రమా! నిత్యసూరులకు నాయకుడా! నిద్రింపరాదు. మేల్కొనుము. స్వచ్ఛమైన ఎఱ్ఱని బంగారముతో చేయబడిన కడియము కాలిని దాల్చిన బలరామా! నీవును, నీ తమ్ముడును మేల్కొనవలెను. అని గోపికలు ప్రార్థించిరి.

**అవ** : పురుషకార భూతురాలగు నీలాదేవిని ఈ పాశురమున మేల్కొలుపు
చున్నారు.

● **ఉ**న్దు మదగళిత్తన్ ఓడాదతోళ్ వలియన్!
నన్దగోపాలన్ మరుమగళే! నప్పిన్నాయ్!
కన్దం కమళుం కుళలీ కడై తిఱవాయ్
వన్దు ఎఙ్గుం కోళి యళైత్తనగాణ్ మాదవి
ప్పన్దల్ మేల్ పలకాల్ కుయిలినఙ్గళ్ కూవినకాణ్
పన్దార్ విరలి! ఉన్ మైత్తునన్ పేర్పాడ
శెన్దామరై క్కైయాల్ శీరార్ వళై యొలిప్ప
వన్దు తిఱవాయ్ మగిళ్న్దేలో రెమ్బావాయ్, ౧౮

ఏనుగులతో పోరాడ గలిగినవాడును, మదము స్రవించుచున్న ఏనుగువంటి బలము కలవాడును. యుద్ధములో శత్రువులను జూచి వెను కంజ వేయనివాడును అయిన నందగోపుని కోడలా, సుగంధము వెదజల్లు చున్న కేశపాశముగల ఓ నీలాదేవి! తలుపు గడియ తెరవుము. కోళ్ళు అంతటచేరి అరచుచున్నవి మాధవీలత పాకిన పందిరిమీద గుంపులు గుంపులుగా కూర్చున్న కోకిలలు కూయుచున్నవి. తెల్లవారినది. చూడుము బంతి చేతితోపట్టుకొనినదానా! మీ బావ గుణములను కీర్తించుటకు వచ్చి తిమి. నీవు సంతోషముతో లేచి నడచి వచ్చి, ఎఱ్ఱ తామర పూవును పోలిన నీ చేతితో, అందమైన చేతి కంకణములు గల్లుమని ధ్వని చేయు నట్లు తలుపు తెరువుము.

అవ : లక్ష్మీదేవిని, నారాయణుని వేరుగా భావింపక ఈ ఇద్దరున్నూ రక్షకులని ఎరిగి ఈ పాశురమున శ్రీకృష్ణుని, నీలాదేవి నిద్దరిని కలిపి మేల్కొలుపుచున్నారు

కుత్తువిళక్కెరియ క్కోట్టుక్కాల్ కట్టిల్మేల్
మెత్తెన్ఱ పఞ్చశయనత్తిన్ మేలేఱి
కొత్తలర్ పూఙ్గుళల్ నప్పిన్నై కొఙ్గై మేల్
వైత్తుక్కిడన్ద మలర్మార్బా! వాయ్తిఱవాయ్
మైత్తడఙ్కణ్ణినాయ్! నీ ఉన్ మణాళనై
ఎత్తనై పోదుం తుయిలెళ వొట్టాయ్గాణ్
ఎత్తనై యేలుమ్ పిరివాత్త గిల్లాయాల్
తత్తువమన్ఱుం తగవేలోరెమ్బావాయ్. ౧౯

గుత్తి దీపములు చుట్టును వెలుగుచుండగా, ఏనుగు దంతములతో చేయబడిన కోళ్లుగల మంచముపై నున్న చల్లదనము, మెత్తదనము, తెల్లదనము, ఎత్తు, వెడల్పు కలిగిన పాన్పుపై నెక్కి, గుత్తులు, గుత్తులుగా వికసించుచున్న పూలు తలలో ముడుచుకొనిన కేశపాశముగల నీలాదేవి యొక్క స్తనములపై తన శరీరమును అనుకొని పరుండి విశాలమైన వక్షస్థలముగల శ్రీకృష్ణా! నోరుతెరచి మాటాడుము. కాటుక పెట్టుకొనిన విశాలమైన కన్నులుగల ఓ నీలాదేవీ! నీవు నీ ప్రియుని ఎంత సేపు లేవనీయవు? ఇంతమాత్రపు ఎడబాటుకూడ ఓర్వలేకుండుట నీ స్వరూపమునకు, నీ స్వభావమునకు తగదు.

అవ : ఈ పాశురమునగూడ శ్రీ శ్రియఃపతుల యవతారమగు నీలాదేవి శ్రీకృష్ణులను మేల్కొలుపుచున్నారు.

ముప్పత్తు మూవర్ అమరర్క్కు మున్శెన్ఱు
కప్పమ్ తవిర్క్కుం కలియే! తుయిలెళాయ్
శెప్పముడైయాయ్! తిఱలుడైయాయ్! శెత్తార్క్కు
వెప్పం కొడుక్కుమ్ విమలా! తుయిలెళాయ్
శెప్పన్న మెన్ములై చ్చెవ్వాయ్ చిఱుమరుఙ్గుల్
నప్పిన్నై నంగాయ్! తిరువే! తుయిలెళాయ్
ఉక్కముం తట్టొళియుమ్ తన్దు ఉన్ మణాళనై
ఇప్పోదే ఎమ్మై నీరాట్టేలో రెమ్బావాయ్. ౨౦

33 కోట్ల అమరులకు వారికింకను ఆపద రాకముందే పోయి, యుద్ధభూమిలో వారికి ముందు నిలిచి, వారికి శత్రువుల వలన కలిగెడి భయమును తొలగించెడి బలశాలీ! మేల్కొనుము. ఆర్జవము కలవాడా! రక్షణముచేయు స్వభావము కలవాడా! బలము కలవాడా! ఆశ్రితుల శత్రువులనే నీ శత్రువులుగా భావించి వారికి భయజ్వరమును కల్గించువాడా! నిర్మలుడా! మేల్కొనుము.

బంగారు కలశములను పోలిన స్తనములును, దొండపండువలె ఎఱ్ఱని పెదవియును, సన్నని నడుమునుకల ఓ నీలాదేవి! పరిపూర్ణురాలా! లక్ష్మీ సమానురాలా! మేల్కొనుము. వీచుటకు ఆలవట్టమును (విసన కఱ్ఱను) కంచుటద్దమును మాకొసంగి నీ వల్లభుడగు శ్రీకృష్ణునితో కలసి మేము స్నానమాడునట్లు చేయుము.

ఆప శ్రీకృష్ణపరమాత్మ యొక్క కల్యాణ గుణములకు ఓడి వచ్చితిమి అనుగ్రహింపుమని నీలాదేవితో సహా గోపికలు ఈ పాశురమున శ్రీకృష్ణుని అర్థించుచున్నారు.

ఏత్త కళఙ్గళ్ ఎదిర్ పొఙ్గి మీదళిప్ప
మాత్తాదే పాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుంపశుక్కళ్
ఆత్తప్పడైత్తాన్ మగనే అఱివుఱాయ్
ఊత్తముడైయాయ్! పెరియాయ్! ఉలగినిల్
తోత్తమాయ్ నిన్ఱ శుడరే! తుయిలెழాయ్
మాత్తారునక్కు వలితొలైన్దున్ వాశఱ్కణ్
ఆత్తాదువన్దు ఉన్ అడిపణియు మాపోలే
పోత్తియామ్ వన్దోం పుగళ్న్దేలో రెమ్బావాయ్. ౨౧

పొదుగు క్రింద నుంచిన కడవలు చరచర నిండి, పొంగి పొరలు నట్లు ఆగక, పాలు స్రవించు అసంఖ్యాకములగు ఉదారములగు బలసిన ఆవులుగల నందగోపుని కుమారుడా! మేల్కొనుము. ప్రమాణదార్ఢ్యము గల పరబ్రహ్మ స్వరూపా! ఆశ్రిత రక్షణ ప్రతిజ్ఞాదార్ఢ్యముగల మహా మహిమ సంపన్నా! ఈ లోకములో ఆవిర్భవించిన జ్యోతిస్వరూపా నిద్ర నుండి లెమ్ము. శత్రువులు నీ పరాక్రమునకు లొంగి నీవాకిటికి వచ్చి నీ దాసులై నీ పాదారవిందముల నాశ్రయించినట్లు మేముకూడ నిన్ను వీడి యుండలేక నీ పాదములనే స్తుతించి మంగళాశాసనము చేయుటకై వచ్చితిమి.

అవ : ముందు పాశురమున అనన్య గతిత్వము, అనన్యార్హ శేషత్వము అను రెండు విధముల స్వరూపమును వివరించి, ఈ పాశురమున అట్టి అభిమానమునంతను విడిచివచ్చితిమి అనుగ్రహింపుమని అర్థించుచున్నారు.

అఙ్గణ్ మాఞాలత్తరశర్ అబిమాన
పఙ్గమాయ్ వన్దునిన్ పళ్ళిక్కట్టిల్ కీళే
శఙ్గమిరుప్పార్ పోల్ వన్దు తలైప్పెయ్‌దోమ్
కిఙ్గిణివాయ్‌చ్చెయ్‌ద తామరై ప్పూప్పోలే
శెఙ్గణ్ శిఱిచ్చిఱిదే యెమ్మేల్ విళియావో
తిఙ్గళుమాదిత్తియనుం ఎళున్దాప్పోల్
అఙ్గణిరణ్డుఙ్గొణ్డు ఎఙ్గళ్ మేల్ నోక్కుదియేల్
ఎఙ్గళ్ మేల్ చాపం ఇళన్దేలోరెమ్బావాయ్. ౨౨

సుందరము విశాలమునగు మహాపృథ్వీ మండలమునంతను ఏలిన రాజులు తమకంటె గొప్పవారులేరనెడి అహంకారమును వీడి తమను జయించిన సార్వభౌముని సింహాసనము క్రింద గుంపులు గుంపులుగా చేరి యున్నట్లు, మేమును అభిమానభంగమై వచ్చి నీ సింహాసనము క్రింద గుంపులు గుంపులుగా చేరియున్నాము. చిరుగంట ముఖమువలె వీడి యున్న తామరపువ్వవలె వాత్సల్యముచే ఎఱ్ఱగానున్న నీ కన్నులను మెల్ల మెల్లగా విచ్చి మాపై ప్రసరింప చేయుము.

సూర్యచంద్రులిరువురు ఒక్కసారి ఆకసమున ఉదయించునట్లుండెడి నీ రెండు నేత్రములతో మావైపు కటాక్షించితివా? మేము అనుభవించియే తీరవలెననెడి శాపమువంటి కర్మకూడ మమ్ములను వీడిపోవును

అవ: గుహలో నిద్రించు సింహము వెలికివచ్చినట్లు వెలికివచ్చి సింహా
సన మధిరోహించి తాము వచ్చిన కార్యము నరయ గోరిరి.

● మారి మలై ముళఙ్జిల్ మన్నిక్కిడన్దుఱఙ్గుమ్
శీరియశిఙ్గం అఱివుత్తు త్తీవిళిత్తు
వేరిమయిర్ పొఙ్గ వెప్పాడుమ్ పేర్ న్దుదఱి
మూరి నిమిర్న్దు ముళఙ్గి ప్పుఱప్పట్టు
పోదరుమా పోలే నీ పూవై ప్పూవణ్ణా! ఉన్
కోయిల్ నిన్ఱిఙ్గనే పోన్దరుళి కోప్పుడైయ
శీరియ శిఙ్గాశనత్తిరున్దు యాంవన్ద
కారియం ఆరాయ్న్దరుళేలో రెమ్బావాయ్. —23

పర్వత గుహలో వర్షాకాలమున కదలక మెదలక పరుండి నిద్రించుచున్న శౌర్యముగల సింహము మేల్కొని తీక్షణమగు చూపు నిటునటుచూచి. ఒక విధమగు వాసనగల తన దేహమందలి వెంట్రుకలు నిగురునట్లుచేసి, అన్నివైపుల దొర్లి, దులపుకొని, వెనుకకు ముందుకు శరీరమునుచాపి గర్జించి, గుహ నుండి వెల్వడి వచ్చినట్లు ఓ అతసీ పుష్పమువర్ణా! నీవు నీ భవనమునుండి ఇట్లే బయటికి వేంచేసి రమణీయ సన్నివేశముగల లోకోత్తరమగు సింహాసనమును అధిష్టించి మేము వచ్చిన కార్యమును ఎరుగ ప్రార్థించుచున్నాము.

అవ : మంగళశాసన మొనర్చిరి.

● అన్జివ్వులగ మళన్దాయ్ అడిపోత్తి
శెన్జఙ్గు తెన్నిలంగై శెత్తాయ్! తిఱల్ పోత్తి
పొన్జ చ్చగడముదై త్తాయ్! పుగళ్ పోత్తి
కన్జు కుణిలా వెఱిన్దాయ్! కళల్ పోత్తి
కున్జు కుడైయా వెడుత్తాయ్! కుణంపోత్తి
వెన్జుప్పగై కొడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోత్తి
ఎన్జెన్జుమ్ శేవగమే యేత్తిప్పఱై కొళ్వాన్
ఇన్జు యామ్ వన్దోం ఇరఙ్గేలో రెమ్బావాయ్. —౨౪

ఆనాడు బలిచక్రవర్తి తనదికాని రాజ్యమును తాను ఆక్రమించి దేవతలను పీడింపగా ఈ లోకమునంతను వానివద్ద నుండి దానముపట్టి పాదములతో కొలిచిన మీ దివ్యపాదారవిందములకు మంగళము.

రావణుడు సీతమ్మను అపహరించుకొనిపోగా ఆ రావణుని లంక కేగి సుందర భవనములు, కోటలు, అందలి రాక్షసులను చెండాడిన మీ బాహు పరాక్రమునకు మంగళము.

శ్రీకృష్ణునకు రక్షణకై యుంచిన బండిపై ఆవేశించిన రాక్షసుని చంపుటకై ఆ బండికి తగులునట్లు కాలుచాచి నేలకూల్చిన అప్రతిహత కీర్తికి మంగళము.

వత్సముపై ఆవేశించిన అసురునితో వెలగచెట్టుపై నావేశించిన యసురుని చంపుటకై ఒడిసెలరాయి విసరినట్లుగా వెలగచెట్టుపైకి దూడను విసరునపుడు ముందువెనకలకు పాదములుంచి నిలచిన మీ దివ్య పాదములకు మంగళము.

ఇంద్రుడు తనకు యాగము లేకుండ చేసెనను కోపముచే రాళ్ళ వాన కురియగా గోపాలురకు, గోవులకు బాధ కలుగకుండునట్లు గోవర్ధన పర్వతమును గొడుగువలె ఎత్తిన మీ వాత్సల్యమునకు మంగళము.

శత్రువులను సమూలముగా పెకలించి విజయము నార్జించి ఇచ్చెడి హస్తమునందలి వేలాయుధమునకు మంగళము.

ఈ ప్రకారముగా నీ వీరచరిత్రములనే కీర్తించి పఱయనెడి వ్రత సాధనము నందగ మేమీనాడు వచ్చినారము అనుగ్రహింపుము.

అవ : అవతార రహస్యమును పేర్కొని అర్థించి వచ్చితిమి అని విన్నవించిరి.

ఒరుత్తి మగనాయ్ పిఱన్దు ఓరిరవిల్
ఒఱుత్తి మగనాయ్ ఒళిత్తు వళర
తరుక్కిలానాగి త్తాన్ తీఙ్గు నినైన్ద
కరుత్తై ప్పిళై ప్పిత్తు కఞ్జన్ వయిత్తిల్
నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే ఉన్నై
అరుత్తిత్తు వన్దోమ్ పఱై తరుదియాగిల్
తిరుత్తక్క శెల్వముమ్ సేవగముం యామ్పాడి
వరుత్తముం తీర్ న్దు మగిళ్ న్దేలో రెమ్బావాయ్. 25

భగవానుడే తన కుమారుడుగా కావలెనని కోరి, శంఖ చక్ర గదాధరుడు అగు భగవానునే కుమారునిగా పొందగలిగిన సాటిలేని దేవకీ దేవికి కుమారుడవై జన్మించి, శ్రీకృష్ణుని లీలలను పరిపూర్ణముగా అనుభవించి, కట్టను కొట్టను భగవానుని వశమొనర్చుకొనిన అద్వితీయ వైభవముగల యశోదకు, ఆ రాత్రియే కుమారుడవై, దాగి పెరిగినవాడా! అట్లు పెరుగుచున్న నిన్ను చూచి ఓర్వలేక చంపవలెనని దుష్టభావముతో మన్న కంసుని అభిప్రాయమును వ్యర్థముచేసి, వాని కడుపులో చిచ్చువై నిన్ను చంపవలెనని తలంచిన వానిని నీవే చంపిన ఆశ్రిత వ్యామోహము గలవాడా; నిన్నే కోరి వచ్చినాము. పఱయను వాద్యమువిచ్చిన ఇమ్ము. సాక్షాత్తు లక్ష్మియే పొందవలెనని కోరదగిన నీ ఐశ్వర్యమును, నీ వీర చరిత్రమును కీర్తించి శ్రమను వీడి ఆనందించుచున్నాము.

అవ : వ్రతమునకు కావలసిన పరికరములను కోరిరి.

మాలే! మణివణ్ణా! మార్గళి నీరాడువాన్
మేలై యార్ శెయ్వనగళ్ వేణ్డువన కేట్టియేల్
ఞాలత్తై యెల్లామ్ నడుఙ్గ మురల్వన
పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్చశన్నియమే
పోల్వన శఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడై యనవే
శాల పెరుమ్పఱై యే పల్లాణ్డిశైప్పారే
కోలవిళక్కే! కొడియే వితానమే!
ఆలినిలై యాయ్! అరుళేలో రెమ్బావాయ్. ౨౬

ఆశ్రితవ్యామోహము కలవాడా! ఇంద్రనీలమణిని పోలిన కాంతియు స్వభావమును కలవాడా! అఘటితఘటనాసామర్థ్యముచే చిన్న మర్రి యాకుపై యమిరి పరుండువాడా! మేము మార్గశీర్ష స్నానము చేయగోరి దానికి కావసిన పరికరములర్థించి నీవద్దకు వచ్చితిమి. ఆ స్నానవ్రతమును మా పూర్వులు శిష్టులు ఆచరించినారు నీవు విన్నచో దానికి కావలసిన పరికరములను విన్నవించెదము.

ఈ భూమండలమంతయు వణకునట్లు శబ్దముచేయు, పాలవలె తెల్లనైన నీ పాంచజన్యమనెడి శంఖమును బోలిన శంఖములు కావలెను. విశాలమగు చాల పెద్ద 'పఱ' యను వాద్యములు కావలెను. మంగళగానముచేయు భాగవతోత్తములు కావలెను. మంగళ దీపములు కావలెను. ధ్వజములు కావలెను. మేలుకట్లు కావలెను. పై పరికరములను కృప చేయుము. అని గోపికలు శ్రీకృష్ణుని ప్రార్థించిరి.

అవ : వ్రతానంతరము తమకు జరుగదగిన సమ్మానమును వివరించిరి.

● కూడారై వెల్లుమ్ శీర్ కోవిన్దా! ఉన్దన్నై
ప్పాడి ప్పఱై కొణ్డు యాం పెఱుశమ్మానమ్
నాడు పుగళుమ్ పరిశినాల్ నన్రాగ
శూడగమే తోళ్వళై యే తోడే శెవిప్పూవే
పాడగమే యెన్ఱనైయ ప్పల్ కలనుం యామణివోమ్
ఆడై యుడుప్పోమ్ అదన్పిన్నే పాల్ శోర
మూడ నెయ్ పెయ్దు ముళంగై వళివార
కూడి యిరున్దు కుళిర్ న్దేలో రెమ్బావాయ్. ౨౭

తనతో కూడని శత్రువులను జయించెడి కళ్యాణ గుణ సంపదగల గోవిందా! నిన్ను కీర్తించి వ్రతసాధనమగు పరయను వాద్యమును పొంది, పొందదలచిన ఘన సన్మానము లోకులందరు పొగడెడి తీరులో మండును చేతులకు గాజులు మొదలగు ఆభరణములు, బాహువులకు దండకడియములు, చెవిక్రింద భాగమున దాల్చెడి దుద్దు, పై భాగమున పట్టుకొనెడి కర్ణ పూవులు, కాలియందెలు మొదలగు అనేక ఆభరణము లను మేము దాల్పవలెను. తరువాత పాలన్నము, మునుగునట్లు నేయి పోసి ఆ మధుర పదార్థము మోచేతి వెంబడి కారునట్లు నీతో కలసి కూర్చొని చల్లగా హాయిగా భుజింపవలెను. అని గోపికలు తమ వ్రత ఫలము ఇందు విన్నవించిరి.

అవ : తన తక్కువ తనమును, స్వామి మహత్త్వమును వారికిగల సంబంధమును పేర్కొని తామంతకుముందు చేసిన తప్పులను క్షమించి తమ వాంఛితము నీడేర్పదని తమ వాంఛితమును సాధింప శ్రీ కృష్ణుడే సాధనమని చెప్పిరి.

● కఱవై గళ్ పిన్ శెన్ఱు కానమ్ శేర్న్దుణ్బోమ్
అఱివొన్ఱు మిల్లాద ఆయ్క్కులత్తు ఉన్దన్నై
ప్పిఱవి పెఱున్దనై పుణ్ణియమ్ యాముడై యోమ్
కుఱై వొన్ఱు మిల్లాద కోవిన్దా! ఉన్దన్నోడు
ఉఱవేల్ నమక్కిఙ్గొళిక్క వొళియాదు
అఱియాద పిళ్ళైగళోమ్ అన్బినాల్, ఉన్దన్నై
చ్చిఱు పేరళై త్తనవుం శీఱి యరుళాదే
ఇఱైవా! నీ తారాయ్ పఱయేలో రెమ్బావాయ్. ౨౮

పశువులవెంట వానిని మేపుటకై అడవికిపోయి అచటనే రుచి నియమములులేక తిని జీవించి యుండుటయే ప్రయోజనముగా తిని తిరిగెడి వారము. ఏమియు జ్ఞానములేని మా గోపవంశమున మాతో సజాతీయుడవై నీవు జన్మించిన పుణ్యమే మాకున్న పుణ్యము. మాకెన్ని లోపములున్నను తీర్పగలిగిన ఏ లోపము లేనివాడవుకదా గోవిందా ఓ స్వామీ? నీతో మాకుగల సంబంధము పోగొట్టుకొన వీలుకాదు. లోకమర్యాద నెరుంగని పిల్లలము అందుచే ప్రేమవలన నిన్ను చిన్న పేరుపెట్టి పిలచినాము. దానికి కోపము తెచ్చుకొని మమ్ములనుగ్రహింపక యుండకుము. మాకు అపేక్షితమగు పఱను ఒసంగుము.

అవ : పఱయను వాద్యమును పొందుచే తమ అభిమతముకాదని విడదీయ రాని స్వామితో సంబంధమే తమ వాంఛితమని వాచ్యముగ వివరించిరి.

● శిత్తుం శిఱుకాలే వన్దున్ని చ్చేవిత్తు ఉన్
పొత్తామరై యడియే పోత్తుమ్ పొరుళ్ కేళాయ్
పెత్తుం మేయ్‌త్తుణ్డుం కులత్తిల్ పిఱన్దు నీ
కుత్తేవల్ ఎజ్గళై క్కొళ్ళామల్‌పోగాదు
ఇత్తైపఱై కొళ్వాన్ అన్ఱుకాణ్ గోవిన్దా!
ఎత్తైక్కుమేళేళుపిఱవిక్కుమ్ ఉన్దన్నోడు
ఉత్తోమేయావోం ఉనక్కే నామాళ్చెయ్‌వోమ్
మత్తైనజ్కామజ్గళ్ మాత్తేలోరెమ్బావాయ్. 29

బాగుగా తెల్ల వారకమునుపే నీవున్న చోటికి మేమువచ్చి నిన్ను సేవించి బంగారు తామరపూవులవలె సుందరములు, స్పృహణీయములు ఐన చరణములకు మంగళము పాడుటకు ప్రయోజనమును వినుము. పశువులను మేపి అవి మేసిన తరువాతనే తాము భుజించెడి గోపకులమున పుట్టిన నీవు మేము చేయు అంతరంగ కైంకర్యములను స్వీకరింప కుండుట తగదు. నేడు నీ నుండి పఱను పుచ్చుకొని పోవుటకు వచ్చిన వారము కాము. ఏనాటికిని ఏడేడు జన్మలకును నీతో విడరాని బంధుత్వము కలవారమే కావలెను. నీకే సేవలుచేయు వారము కావలెను. మాకు ఇతరములైన కోరికలేవియు లేకుండునట్లు చేయుము.

అవ : గోపికలవలె, గోదాదేవివలె పరిపూర్ణమగు భావబంధము లేనివారు గూడ ఈ 30 పాశురములను క్రమము తప్పక చదువుటచేతనే, గోపికలుపొందిన ఫలమును, గోదాదేవిపొందిన ఫలమును, పొందగలరని వివరించుచున్నారు.

● వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిళైయార్ శెన్రిఱైఞ్జి
అఙ్గప్పఱై కొణ్డవాత్తై అణిపుదువై
ప్పైఙ్గమల త్తణ్తెరియల్ ప్పట్టర్పిరాన్ కోదైశొన్న
శఙ్గత్తమిళ్మాలై ముప్పదుమ్ తప్పామే
ఇఙ్గిప్పరిశురై ప్పార్ ఈరిరణ్డు మాల్వరై త్తోళ్
శెఙ్గణ్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్
ఎఙ్గుం తిరువరుళ్ పెత్తు ఇన్పురువ రెమ్పావాయ్. 30

ఓడలతో నిండియున్న క్షీరసముద్రమును మధింపచేసి లక్ష్మీదేవిని పొంది మాధవుడైనవానిని, బ్రహ్మరుద్రులకు కూడ నిర్వాహకుడైన వానిని ఆనాడు వ్రేపల్లెలో చంద్రముఖులగు వారును, విలక్షణాభరణము లను దాల్చినవారును అగు గోపికలు చేరి, మంగళము పాడి, పఱయను వాద్యమును లోకులకొరకును, భగవద్దాస్యమును తమకొరకును పొందిరి. ఆ ప్రకారమునంతను, లోకమునకు ఆభరణమైయున్న శ్రీవిల్లిపుత్తూరులో అవతరించి సర్వదా తామరపూసల మాలను మెడలో ధరించి యుండు శ్రీభట్టనాధుల పుత్రికయగు గోదాదేవి ద్రావిడ భాషలో 30 పాశురము లలో మాలికగా కూర్చినది.

ఎవరీ 30 పాశురములను క్రమము తప్పక చదువుదురో వారు ఆనాడు గోపికలా శ్రీకృష్ణుని నుండి పొందిన ఫలమును గోదాదేవి వ్రతమునాచరించి పొందిన ఫలమునుగూడ పొందుదురు. కేవలము అధ్యయనము చేయుట చేతనే పుండరీకాక్షుడును, పర్వత శిఖరములవంటి బాహు శిరస్సులు గలవాడునగు శ్రీవల్లభుడున్ను చతుర్భుజుడును అగు శ్రీమన్నారాయణుడే వారికి సర్వత్ర సర్వదా ఆనందమును ప్రసాదించును.

స్వోచ్ఛిష్ట మాలికాబంధ
గంధబంధుర జిష్ణవే
విష్ణుచిత్త తనూజాయై
గోదాయై నిత్య మంగళమ్!

శ్రీమత్త్యై విష్ణు చిత్తార్యై
మనో నందన హేతవే
నంద నందన సుందర్యై
గోదాయై నిత్యమఙ్గళమ్.

మాదృశా కిఞ్చన త్రాణ
బద్ధ కంకణ పాణయే
విష్ణు చిత్త తనూజాయై
గోదాయై నిత్యమఙ్గళమ్,

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు!

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేస్స్వభావాత్
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి!

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

పెరియాళ్వార్ ప్రసాదించిన

# నీరాట్టము

(అభ్యంజనము)

వెణ్ణై యళైన్ద కుణుఙ్గుమ్ విళైయాడు పుళుదియు ఙ్గొణ్డు,
తిణ్ణెన వివ్విరా వున్నై త్తేయ్త్తు క్కిడక్క నా నొట్టేన్,
ఎణ్ణెయ్ వుళిప్పళ ఙ్గొణ్డు ఇఙ్గెత్తనై పోదు మిరున్దేన్,
నణ్ణలరియపిరానే! నారణా! నీరాడ వారాయ్. 1

కన్ఱుగళోడ చ్చెవియిల్ కట్టెఱుమ్బు పిడిత్తిట్టాల్.
తెన్ఱిక్కెడుమాగిల్ వెణ్ణెయ్ త్తిరట్టి విళుఙ్గుమా గాణ్బన్,
నిన్ఱ మరామర ఞ్జాయ్త్తాయ్! నీపిఱన్ద తిరువోణమ్,
ఇన్ఱు నీ నీరాడవేణ్డుమ్ ఎమ్బిరాన్! ఓడాదే వారాయ్. 2

పేయ్చ్చిములై యుణ్ణక్కణ్డు పిన్నైయుమ్ నిల్లాదెన్నెఞ్జమ్,
ఆయ్చ్చియ రెల్లారుఙ్గూడి యళైక్కవుమ్ నాన్ మొలైతన్దేన్,
కాయ్చ్చిన నీరొడు నెల్లి కడారత్తిల్ పూరిత్తు వైత్తేన్,
వాయ్త్తపుగళ్ మణివణ్ణా! మఞ్జనమాడ నీవారాయ్. 3

కఞ్జన్ పుణర్ప్పినిల్ వన్ద కడియశగడ ముదైత్తు,
వఞ్జగ ప్పేయ్మగళ్ తుఞ్జ వాయ్ములై వైత్తపిరానే!
మఞ్జళుమ్ శెఙ్గళునీరిన్ వాశిగైయుమ్ నాఱు శాన్దుమ్,
అఞ్జనము ఙ్గొణ్డువైత్తేన్ అళగనే! నీరాడ వారాయ్. 4

అప్పఙ్గలన్ద శిత్తుణ్ణి యక్కారమ్ పాలిల్ కలన్దు,
శొప్పడ నాన్ శుట్టువైత్తేన్ తిన్నలుఱుదియేల్ నమ్బీ,
శెప్పిళ మెన్ములై యార్గళ్ శిఱుపుఱమ్ పేశి చ్చిరిప్పర్,
శొప్పడ నీరాడవేణ్డుమ్ శోత్తమ్ పిరాన్! ఇఙ్గేవారాయ్. 5

ఎణ్ణెయ్క్కుడత్తై యురుట్టి ఇళమ్బిళ్ళై క్కిళ్ళి యెఴుప్పి,
కణ్ణైప్పురట్టి విఴిత్తు క్కఴగణ్డు శెయ్యుమ్బిరానే!,
ఉణ్ణ క్కనిగళ్ తరువన్ ఒలికడ లోదనీర్పోలే,
వణ్ణమఴగియ నమ్బీ! మఞ్జనమాడ నీ వారాయ్. 6

కఱన్ద నఱ్పాలు న్తయిరుమ్ కడైన్దుఱిమేల్ వైత్త వెణ్ణెయ్,
పిఱన్దదువే ముదలాగ ప్పెత్తఱియే నెమ్బిరానే!
శిఱన్దనత్తాయలర్ తూత్తుమ్ ఎన్బదనాల్ పిఱర్మున్నే,
మఱన్దు మురైయాడమాట్టేన్ మఞ్జనమాడ నీవారాయ్. 7

కన్ఱినై వాలోలై కట్టి క్కనిగ ళుదిర వెఱిన్దు,
పిన్తుడర్ న్దోడియోర్ పామ్బై పిడిత్తుక్కొణ్డాట్టినాయ్ పోలుమ్.
నిన్ఱిఱత్తే నల్లే నమ్బీ! నీపిఱన్ద తిరునన్నాళ్,
నన్ఱు నీ నీరాడవేణ్డుమ్ నారణా! ఓడాదే వారాయ్. 8

పూణి త్తొఴువినిల్ పుక్కు ప్పుఴుదియళైన్దపొన్మేని
కాణ ప్పెరిదుముగప్పన్ ఆగిలుమ్ కణ్డార్ పఴిప్పర్,
నాణిత్తనైయు మిలాదాయ్! నప్పిన్నై కాణి చ్చిరిక్కుమ్,
మాణిక్కమే! ఎన్మణియే! మఞ్జనమాడ నీవారాయ్. 9

కార్మలి మేనినిఱత్తు క్కణ్ణపిరానై యుగన్దు:
వార్ మలి కొజ్గై యశోదై మఙ్జనమాట్టియ వాత్తై,
పార్మలి తొల్పుదువై క్కోన్ పట్టర్పిరాన్ శొన్నపాడల్,
శీర్మలి శెన్దమిళ్ వల్లార్ తీవినై యాదు మిలరే. 10

**అదివరపు** :- వెణ్ణెయ్, కన్టు. పేయ్చ్చి, కఞ్జన్, అప్పమ్, ఎణ్ణెయ్. కఱన్ద, కన్ఱినై, పూణి, కార్, పినై.

శ్రీ పెరియాళ్వార్ల తిరువడిగళ్ళే శరణము.



మధురకవి యాళ్వార్ ప్రసాదించిన

# కణ్ణినుణ్ శిఱుత్తాంబు

(నాథమునులకు నాలాయిర ముపదేశించినందుకు మూలమంత్రమైనది)

తనియన్లు

నాథమునులు సాదించినది

అవిదితవిషయాన్తర శ్శఠారేః
ఉపనిషదాముపగానమాత్రభోగః।
అపిచగుణవశాత్త దేకశేషీ
మధురకవి ర్హృదయే మమావిరస్తు॥

వేరొన్రుం నాన్అఱియేన్ వేదంతమిళ్ శెయ్ద*
మాఱన్ శడగోపన్ వణ్గురుగూర్ – ఏఱెజ్గళ్
వాళ్వామెన్రేత్తుం మదురకవియార్* ఎమ్మై
ఆళ్వారవరే యరణ్.

## నమ్మాళ్వార్ల విషయము.

కణ్ణినుణ్ శిరుత్తామ్బినాల్
కట్టుణ్ణప్పణ్ణియపెరుమాయన్* ఎన్నప్పనిల్*
నణ్ణిత్తెన్గురుగూర్ నమ్బి యెన్రక్కాల్*
అణ్ణిక్కుమముదూఱుం ఎన్నావుక్కే. 1

నావినాల్నవిత్తు ఇన్బమెయ్దినేన్*
మేవినేన్ అవన్ పొన్నడి మెయ్మ్మైయే*
తేవుమత్తఱియేన్ కురుగూర్నమ్బి*
పావినిన్నిశై పాడిత్తిరివనే. 2

తిరితన్దాగిలుం తేవపిరానుడై *
కరియకోలత్తిరువురు కాణ్బన్నాన్*
పెరియవణ్కురుగూర్ నగర్నమ్బిక్కు ఆళ్*
ఉరియనాయ్* అడియేన్ పెత్తనన్మైయే. 3

నన్మైయాల్మిక్క నాన్మఱైయాళర్కళ్*
పున్మైయాగక్కరుదువరాదలిల్*
అన్నైయాయ్ అత్తనాయ్ ఎన్నైయాణ్డిడుమ్
తన్మైయాన్* శడగోపన్ ఎన్నమ్బియే. 4

నమ్బినేన్ పిరర్ నన్పొరుళ్ తన్నైయుమ్*
నమ్బినేన్ మడవారైయుమున్నెలామ్*
శెమ్బొన్మాడ త్తిరుక్కురుగూర్ నమ్బిక్కు
అన్బనాయ్* అడియేన్ శదిర్త్తే నిన్రే. 5

ఇన్రు తొట్టుం ఎఴుమైయుమెమ్బిరాన్*
నిన్రు తన్పుగళ్ ఏత్త అరుళినాన్*
కున్రమాడ తిరుక్కురుగూర్నమ్బి*
ఎన్రుమెన్నై ఇగళ్విలన్ కాణ్మినే. 6

కణ్డుకొణ్డెన్నై క్కారిమాఱప్పిరా఩్*
పణ్డై వల్వినై పాత్తియరుళినా఩్*
ఎణ్డిశైయుం అఱియ వియమ్బుగేన్*
ఒణ్డమిళ్ చ్చడగోపనరుళైయే. 7

అరుళ్కొణ్డాడుం అడియవరిన్బుఱ*
అరుళినాన్ అవ్వరుమఱైయిన్పొరుళ్*
అరుళ్ కొణ్డాయిరం ఇన్దమిళ్ పాడినాన్*
అరుళ్ కణ్డీర్ ఇవ్వులగినిల్ మిక్కదే. 8

మిక్కవేదియర్ వేదత్తినుట్పొరుళ్*
నిఱ్కప్పాడి ఎన్నెఞ్జుళ్ నిఱుత్తినాన్*
తక్కశీర్ చ్చడకోపనెన్నమ్బిక్కు* ఆళ్
పుక్కకాదల్ అడిమైప్పయనన్రే. 9

● పయనన్నాగిలుం పాజ్గలరాగిలుమ్*
శెయల్నన్నాగ త్తిరుత్తి ప్పణికొళ్వాన్*
కుయిల్నిన్నార్ పొళిల్శూళ్కురుగూర్నమ్బి!*
ముయల్గిన్ఱేన్ ఉన్దన్ మొయ్కళఱ్కన్బైయే. 10

● అన్బన్తన్నై అడైన్దవర్గట్కెల్లామ్
అన్బన్* తెన్కురుగూర్ నగర్నమ్బిక్కు*
అన్బనాయ్ మదురకవి శొన్నశొల్
నంబువార్ పది* వైగున్దం కాణ్మినే. 11



# తిరువాయ్ మొళి

## తనియన్లు

శ్రీమన్నాధమునులు ప్రసాదించినది.

భక్తామృతం విశ్వజనానుమోదనం
సర్వార్థదం శ్రీశఠకోపవాఙ్మయమ్।
సహస్రశాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రావిడవేదసాగరమ్॥

శ్రీ ఈశ్వరమునులు అనతిచ్చినది.

తిరువళుదినాడెన్ఱుమ్ తెన్కురుగూరెన్ఱుమ్,
మరువినియ వణ్పొరునలెన్ఱుమ్, అరుమఱైగళ్
అన్దాదిశెయ్దాన్ అడియిణైయే ఎప్పొళుదుమ్,
శిన్దియాయ్ నెఞ్జే! తెళిన్దు.

శ్రీశొట్టైనమ్బులు పాడించినది

మనత్తాలుమ్ వాయాలుమ్ వణ్కురుగూర్ పేణుమ్,
ఇనత్తారై యల్లాదిఱైఞ్జేన్, తనత్తాలుమ్
ఏదుంకుఱై విలేన్ ఎన్దై శడగోపన్,
పాదజ్గళ్ యాముడైపత్తు.

శ్రీ అనాందాళ్వాన్లు ఆనతిచ్చినది.

ఏయ్న్ద పెరుఙ్జీర్త్తి యిరామునుశ మునిదన్
వాయ్న్ద మలర్ప్పాదమ్ వణఙ్గిన్దేన్, ఆయ్న్ద పెరుమ్
శీరార్ శడగోపన్ శెన్దమిళ్ వేదన్దరిక్కుమ్,
పేరాద వుళ్ళ మ్బెఱ.

శ్రీ పరాశరభట్టర్ వారానతిచ్చినవి.

వాన్దిగళు ఞ్జోలై మదిళరఙ్గర్ వణ్బుగళ్మేల్,
ఆన్ద తమిళ్ మఱైగళాయిరముమ్, ఈన్ద
ముదల్తాయ్ శడగోపన్ మొయ్మ్బాల్ వళర్త్త,
ఇదత్తాయ్ ఇరామానుశన్.

మిక్కవిఱై నిలైయుమ్ మెయ్యా ముయిర్నిలైయుమ్,
తక్కనెఱియుమ్ తడైయాగి-త్తొక్కియలుమ్,
ఊళ్వినైయుమ్ వాళ్వినైయుమ్ ఓదుమ్ కురుగైయర్ కోన్,
యాళినిశై వేదత్తియల్.

శ్రీ ఆళ్వార్, ఎమ్బెరుమానార్, జీయర్ తిరువడిగళే శరణమ్.



## ఆండాళ్ తిరునక్షత్ర తనియన్ పాశురములు

కర్కటేపూర్వ ఫల్గున్యాం, తులసీ కాననోద్భవామ్ ।
పాండ్యే విశ్వమ్భరాంగోదాం, వన్దే శ్రీరంగనాయకీమ్ ॥

నీళాతుఙ్గస్తనగిరి తటీసుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వంశ్రుతి శతశిరస్సిద్ధ మధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజనిగళితం యాబలాత్కృత్యభుఙ్క్తే
గోదాతస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తుభూయః ॥

ఇన్రో తిరువాడిప్పూరమ్ ఎమక్కాగ
వన్రో, ఇఙ్గాణ్డాళ వదరిత్తాళ్, కున్రాద
వాళ్వాన వైగున్దవాన్ పోగన్దన్నై యిగళ్న్దు,
ఆళ్వార్ తిరుమగళారాయ్ ॥

పెరియాళ్వార్ పెణ్బిళ్ళైయాయ్, ఆణ్డాళ్ పిఱన్ద
తిరువాడిపూరత్తిన్ శీర్మై, ఒరునాళై
క్కుణ్డో మనమే యుణర్న్దుపార్
ఆణ్డాళుక్కిణ్డాగి లొప్పి దుక్కుణ్డు ॥

అఞ్జుకుడిక్కొరు శన్దతియాయ్, ఆళ్వార్గళ్
తఞ్జెయలై విఞ్జినిఱ్కుమ్ తన్మైయళాయ్, పిఞ్జాయ్
ప్పళుత్తాళై యాణ్డాళై ప్పత్తియుడన్ నాళుమ్
వళుత్తాయ్ మనమే మగిళ్న్దు.



# మంగళాశాసనమ్

పై యన్ద కళియా వార్కడలే నెయ్యాగ
వెయ్య కదిరోన్ విళక్కాగ- శెయ్య
శుదరాళియా నడిక్కే-శూట్టినేన్ శొన్ మాలై
ఇడరాళి నీజ్గగవేయన్ఱు.

అన్బేతగళియా ఆర్వమేనెయ్యాగ
ఇన్బురుగి శిన్దై యిడుతిరియా నన్బురుగి
జ్ఞానచ్చుదర్విళక్కే-త్తినేన్ నారణఱ్కు
జ్ఞానత్తమిళ్ పురిన్దనాన్.

తిరుక్కణ్డేన్ పొన్మేనికణ్డేన్
తిగళుమరుక్కనణినిరముంకణ్డేన్
శెరుక్కిళరుం పొన్నాళికండేన్
పురిశజ్గంకై క్కణ్డేన్ ఎన్నాళివణ్ణన్ పాలిన్ఱు.

శ్రియః కాంతాయ కళ్యాణ - నిధయే నిధయేర్థినాం,
శ్రీ వేంకట-నివాసాయ శ్రీనివాసాయ మంగళం.

లక్ష్మీచరణ-లాక్షాంక-సాక్షాత్-శ్రీవత్సవక్షసే
క్షేమం కరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళం.

అస్తు శ్రీస్తన-కస్తూరీ-వాసనా-వాసితోరసే,
శ్రీహస్తిగిరి-నాథాయ దేవరాజాయ మంగళం.

కమలా కుచ-కస్తూరీ కర్ద మాంకిత-వక్షసే,
యాదవాద్రి-నివాసాయ సంపత్-పుత్రాయ మంగళం.

నీలాచల-నివాసాయ నిత్యాయ పరమాత్మనే,
సుభద్రా-ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళం.

మఙ్గళం కోస లేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మఙ్గళమ్.

స్వోచ్ఛిష్ట-మాలికా-బంధ-గంధ-బంధుర-జిష్ణవే,
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్య-మంగళం.

శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే,
శ్రీతింత్రిణీ-మూలధామ్నే శఠకోపాయ మంగళం.

శేషో వా సైన్యనాథో వా శ్రీపతి ర్వేతి సాత్త్వికైః,
వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళం.

తులామూలావ తీర్ణాయ తోషితాఖిలసూరయే,
సౌమ్యజామాతృ మునయే శేషాంశాయాస్తు మఙ్గళమ్.

మంగళాశాసనపరైః మదాచార్య పురోగమైః,
సర్వైశ్చపూర్వైరాచార్యైః, సత్కృతాయాస్తు మంగళం.

# శాత్తుముఱై

## ఉదయము అనుసంధించవలశిన శాత్తుముఱై పాశురములు

శిత్తం శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తు, ఉన్
పొత్తామరై యడియే పోత్తుం పొరుళ్ కేళాయ్,
పెత్తం మేయ్‌త్తుణ్ణుం కులత్తిల్ పిఱందు, నీ
కుత్తేవలెంగళై క్కొళ్ళామల్ పోగాదు,
ఇత్తై పఱై కొళ్వా నన్ఱుగాణ్ గోవిందా,
ఎత్తైక్కుమేళు పిఱవిక్కుం. ఉన్నోన్ద
డుత్తోమేయావోం ఉనక్కే నామాట్చెయ్‌వోం,
మత్తినం కామజ్గళ్ మాత్తేలోరెంబావాయ్.

వంగక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై,
తిజ్గళ్ తిరుముగత్తు చ్చేయిళై యార్ శెన్ఱిఱైంజి,
అజ్గప్పఱై కొణ్డ వాత్తై అణిపుదువై
పైజ్గమల తణ్డెరియల్ పట్టర్‌పిరాన్ కోదై శొన్న
శజ్గత్తమిళ్ మాలై ముప్పదుం తప్పామే,
ఇజ్గిప్పరిశురై ప్పార్ ఈరిరండు మాల్వరై త్తోళ్,
శెజ్గణ్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్,
ఎజ్గుం తిరువరుళ్ పెత్తు ఇన్బుఱువరెమ్బావాయ్.

సాయంత్రము అనుసన్ధించవలసిన పాశురములు

- అగలగిల్లే నిఱై యుమెన్ఱు అలర్మేల్మఙ్గై యుఱై మార్బా!,
  నిగరిల్ పుగళాయ్ ఉలగమూన్ఱుడైయాయ్ ఎన్నైయాళ్వానే!
  నిగరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే!
  పుగలొన్ఱిల్లాఅడియేన్ ఉన్నడిక్కీళమర్న్దు పుగన్దేనే.

- అడిక్కీళమర్న్దు పుగున్దు అడియార్ వాళ్మినెన్ఱెన్ఱరుళ్కొడుక్కుమ్
  పడిక్కేళిల్లా ప్పెరుమానై ప్పళనక్కురుగూర్చ్చడగోపన్,
  ముడిప్పాన్శొన్న వాయిరత్తు త్తిరువేఙ్గడత్తు క్కివైపత్తుమ్
  పిడిత్తార్పిడిత్తార్ వీత్తిరున్దు పెరియవానుళ్ నిలావువరే.

- పూరువాశారియర్గళ్ పోద మనుట్టానఙ్గళ్
  కూఱువార్ వార్త్తైగళై క్కొణ్డు నీర్ తేఱి.
  ఇరుళ్దరు మాఞాలత్తే యిన్బముత్తు వాళుమ్,
  తెరుళ్దరుమా దేశిగనై చ్చేర్న్దు.

- ఇన్ద ఉపదశరత్తినమాలై దన్నై,
  శిన్దైదన్నిల్ నాళుమ్ శిన్దిప్పార్ ఎన్దై
  ఎదిరాశర్ ఇన్నరుళుక్కెన్ఱు మిలక్కాగి,
  శదిరాగ వాళ్న్దిడువర్ దామ్.

మన్నుయిర్కాళ్! ఇఙ్గే మణవాళమామునివన్,
పొన్నడియామ్ శెఙ్గమల ప్పోదుగళై, ఉన్ని
చ్చిరత్తాలే తీణ్డిల్ అమానవనుమ్ నమ్మై.
కరత్తాలే తీణ్డల్ కడన్,

ఉదయ, సాయంత్రం అనుసన్ధానము చేయవలెను.

"పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు పలకోడి నూఱాయిరం,
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా, ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు,
అడియోమోడుం నిన్నోడుం పిరివిన్ఱి ఆయిరం పల్లాణ్డు,
వడివాయ్ నిన్ వల మార్విల్ వాళ్గిన్ఱ మంగైయుం పల్లాణ్డు
వడివార్ శోది వలత్తుఱైయుం శుడ రాళియుం పల్లాండు.
పడై పోర్ పుక్కు ముళంగుం అప్పాఞ్చ శన్నియముం పల్లాణ్డే.

సర్వదేశదశాకాలే ష్వవ్యాహతపరాక్రమా ।
రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతామభివర్ధతామ్ ॥

రామానుజార్యదివ్యాజ్ఞా ప్రతివాసరముజ్జ్వలా!
దిగన్తవ్యాపినీభూయాత్ సాహిలోకహితైషిణీ ॥

శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ।
శ్రీమన్ శ్రీరఙ్గ శ్రియ మనుపద్రవా మనుదినం సంవర్ధయ॥

నమశ్శ్రీశైలనాథాయ కున్తీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమప్రాప్య కైఙ్కర్యశాలినే ॥

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణంవన్దే రమ్యజామాతరంమునిమ్ ॥

వాళి తిరువాయ్ మొళిప్పిళ్ళై మాదగవాల్ వాళుం
మణవాళమామునివన్ వాళియవన్
మాఅన్ తిరువాయ్ మొళిప్పొరుళై మానిలత్తోర్
తేరుమ్బబడియురైక్కుంశీర్
శెయ్యతామరై త్తాళిణై వాళియే
శేలై వాళి తిరునాబి వాళియే
తుయ్యమార్బుం పురినూలుం వాళియే.
శున్దరత్తిరుత్తోళిణై వాళియే
కైయుమేన్దియ ముక్కోలుం వాళియే
కరుణై పొజ్గియ కణ్ణిణై వాళియే
పొయ్యిలాద మణవాళమాముని పున్దివాళి పుగళ్ వాళి వాళియే
అడియార్గళ్ వాళ్ అరజ్గనగర్ వాళ్
శడగోపన్ తణ్ణమిళ్ నూల్ వాళ్
కడల్ శూళ్న్ద మణ్ణులగుం వాళ్
మణవాళమామునియే ఇన్నుమొరు నూత్తాణ్డిరుమ్॥

విలాసవిక్రాన్త పరావరాలయం
నమస్యదార్తి క్షపణేకృత క్షణమ్।
ధనం మదీయం తవ పాదపఙ్కజం
కదాను సాక్షాత్కరవాణి చక్షుషా ॥

కదాపునశ్శఙ్ఖరథాఙ్గకల్పక
ధ్వజారవిన్దాఙ్కుశ వజ్రలాఞ్ఛనమ్
త్రివిక్రమ! త్వచ్చరణామ్బుజద్వయమ్
మదీయమూర్ధాన మలఙ్కరిష్యతి ॥

వకుళాభరణం వన్దే జగదాభరణం మునిం
యః శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడ భాషయా
వకుళాలంకృతం శ్రీమత్ శఠకోప పదద్వయమ్
అస్మత్కుల ధనం భోగ్యం అస్తు మే మూర్ధ్ని భూషణమ్ ॥

నమజ్జనస్య చిత్త భిత్తి భక్తి చిత్రతూలికా
భవాహి వీర్యభంజనే నరేన్ద్రి మన్త్రియన్త్రిణా
ప్రపన్నలోక కైరవ ప్రసన్న చారుచంద్రికా
శఠారిహస్త ముద్రికా హఠాత్కరోతు మే తమః ॥

ఆకారత్రయ సంపన్నాం అరవిన్ద నివాసినీం
అశేష జగతీశిత్రీం వన్దే వరదవల్లభామ్ ॥

ఓమ్ భగవన్నారాయణాఽభిమతాను రూప
స్వరూప రూప గుణవిభవ ఐశ్వర్య
శీలాద్యనవధికాతిశయ, అసంఖ్యేయ కల్యాణ
గుణగణాం, పద్మవనాలయామ్, భగవతీం,
శ్రియందేవీం, నిత్యానుపాయినీం, నిరవద్యాం,
దేవదేవదివ్యమహిషీం, అఖిల జగన్మాతరం
అస్మన్మాతరం అశరణ్యశరణ్యాం అనన్యశరణః
శరణమహం ప్రపద్యే ।

ఉల్లాసపల్లవిత పాలిత సప్తలోకీ
నిర్వాహకోరకిత నేమ కటాక్షలీలామ్
శ్రీరంగహర్మ్యతల మంగళదీపరేఖాం
శ్రీరంగరాజ మహిషీం శ్రియమాశ్రయామః.

సమస్త జననీంవన్దే । చైతన్యస్తన్యదాయినీం
శ్రేయసీం శ్రీనివాసస్య । కరుణామివ రూపిణీం

నచేద్రామానుజేత్యేషా । చతురాచతురక్షరీ
కామవస్థాం ప్రపద్యన్తే । జన్తవోహన్తమాదృశః.

పుణ్యామ్భోజవికాసాయ । పాపధ్వాన్తక్షయాయచ
శ్రీమానావిర భూద్భూమౌ । రామానుజ దివాకరః.

తృణీకృత విరిఞ్చ్యాది । నిరఙ్కుశ విభూతయః
రామానుజ పదామ్భోజ । సమాశ్రయణశాలినః.

అపగతమదమానై రన్తిమోపాయనిష్ఠైః
అధిగత పరమార్థైరర్థకామానపేక్షైః
నిఖిలజన సుహృద్భిర్నిర్జిత క్రోధలోభైః
వరవరముని భృత్యైరస్తుమే నిత్యయోగః.

శ్రీమతే రమ్యజామాతృ । మునీంద్రాయ మహాత్మనే
శ్రీరఙ్గ వాసినే భూయాత్ । నిత్యశ్రీర్నిత్య మఙ్గళమ్॥



# భాగవత సుధ

## 1

1. నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

యథా విష్ణుమయం సత్యం యథా విష్ణుమయం జగత్
యథా విష్ణుమయం సర్వం పాప్మా మే నశ్యతాం తథా ॥

నారాయణః పరంబ్రహ్మ నారాయణ పరంతపః
నారాయణః పరోదేవః సర్వం నారాయణం సదా ॥

ఓం నమో భగవతే వాసుదేవాయ ధీమహి
ప్రద్యుమ్నాయా నిరుద్ధాయ నమః సంకర్షణాయచ ॥

2. నిగమ కల్పతరోర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతమ్ ।
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికా భువి భావుకాః ॥

వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రమున మొనసియున్న
భాగవత పురాణ ఫల రసాస్వాదన
పదవి గనుడు రసిక భావ విదులు ॥

3. జన్మాద్యస్య యతోऽన్వయాదితరత
శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదాయదాదికవయే
ముహ్యన్తి యత్సూరయః
తేజోవారి మృదాం యథా వినిమయో
యత్ర త్రిసర్గోమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం
సత్యం పరంధీమహి ॥

ఈ ప్రపంచముయొక్క సృష్టి స్థితిలయములను కారణత్వ వ్యతిరేకత్వములతో సాధించువాడును, జగత్కర్తృత్వమును సంపూర్ణముగ నవగత మొనర్చుకొనినవాడును, స్వతస్సిద్ధ జ్ఞానముతో విరాజిల్లువాడును, ఆది కవియగు బ్రహ్మకు బుద్ధివృత్తిని గలుగజేసి మనస్సుద్వారా తత్త్వ వస్తువును వెల్లడించినవాడును, ఇంద్రుడు మున్నగు దేవతలనుగూడ మోహితులను జేసినవాడును, తేజస్సు, జలము మృత్తికయను వాని వినిమయమువలన అన్యవస్తు జ్ఞానము సత్యమువలె ప్రతీతమగునట్లు తనయందు సత్త్వ రజస్తమములను త్రిగుణములయునికి సత్యమువలె ప్రతీతమైనను వాస్తవముగ జడధర్మములేనివాడును, కపటమునకు స్థానము కానివాడును, సత్యస్వరూప లక్షణమయుడునునగు పరమేశ్వరుని ధ్యానింతుము.

4. ధర్మప్రోజ్ఝితకైతవోऽత్ర పరమో
నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం
తాపత్రయోన్మూలనమ్ ।

శ్రీమద్భాగవతే మహామునికృతే
కింవాపరై రీశ్వరః
సద్యోహృద్యవరుధ్యతేఽత్ర కృతిభిః
శుశ్రూషుభిస్తత్ క్షణాత్ ॥

శ్రీ మద్భాగవతమునందు మాత్సర్య రహితులగు సత్పురుషుల శుద్ధ భక్తియోగ రూపమగు పరమధర్మము నిరూపింపబడినది. తాపత్రయ మును నాశనము చేయునట్టిది, శుభప్రదమైనట్టిది, వాస్తవమైనట్టిది, పరమార్థభూతమైనట్టిది, యుగతత్త్వము దీనియందు దెలిసికొనదగినదై యున్నది. ఇది యుండగా నితరశాస్త్రములవలన ప్రయోజనమేమి యుండును ?

ఈ గ్రంథ పరిశీలనవలన శ్రీహరి సుకృతి సంపన్నులగు శ్రోతలచే వెంటనే హృదయమునందవరుద్ధుడగును.

**5.** సూతుని- శౌనకాది ఋషులు ప్రశ్నించిరి ?

1. జీవుని ఆత్యంతిక శ్రేయస్సు (చరమ కళ్యాణము) లేదా పరమ పురుషార్థమేది ?
3. దేనిచే జీవుని బుద్ధి సుప్రసన్నమగను ?
3. భగవానుడగు వాసుదేవుడు ఏ యే కార్యములను సాధించు నుద్దేశ్యముతో దేవకీ గర్భమున ఆవిర్భవించెను.
4. ఆయన ఏ యే యవతారములనెత్తి యే యే కార్యముల నొనరించెను ?
5. శ్రీహరి యవతారముల నన్నింటిని వర్ణింపుడు.
6. యోగీశ్వరుడగు శ్రీకృష్ణుడు స్వధామమునకు వెడలగా ధర్మ మెవరిని శరణుజొచ్చినది ?

6. పరీక్షిత్తు ఋషులనిట్లు ప్రశ్నించె.

1. ఈ ప్రపంచమున మోక్ష లక్షణ సిద్ధిని బొందు నుపాయ మేమి?

2. మృత్యువాసన్నమైనవేళ మానవుడే కార్యము నిరంతరము చేయవలెను?

7. కుంతి- శ్రీకృష్ణుని స్తుతించుట :

కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయచ
నందగోప కుమారాయ గోవిందాయ నమోనమః ॥

నమః పంకజనాభాయ నమః పంకజమాలినే
నమః పంకజనేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే ॥

8. విపదః సన్తు తాః శశ్వ త్తత్ర తత్ర జగద్గురో
భవతో దర్శనం యత్స్యా దపునర్భవ దర్శనమ్ ॥

కృష్ణా! ఏ యాపదలయందు మోక్ష ప్రదమగు నీ దర్శనము కలుగునో ఆ యా విషయములయందు మాకట్టి యాపదలు మాటిమాటికి కలుగుగాక।

9. శ్రీకృష్ణ! కృష్ణసఖ! వృష్ణ్యృషభ భావనిధ్రగ్
రాజన్యవంశ దహనానప వర్గ వీర్య
గోవింద! గోద్విజ! సురార్తి హరావతార!
యోగీశ్వరా! ఖిలగురో! భగవన్నమస్తే! ॥

10. జన్మ, కర్మ, వ్యాధి, విమోచనంబునకు గారణంబగు దివ్యౌషధంబు గావున శ్రీమన్నారాయణ కథామృతమును గ్రోలుము.

11. పరనింద సేయక, వైరంబు వర్జించి, భగవత్పదాంభోజ భక్తి సంయుక్తుండై తిరుగునతండు హరిపదంబుజేరును.

12. సంసార సాగరంబుదాట హరికథయనెడు నావ సహాయంబుగాని వేఱొకటిలేదు.

13. ధర్మంబునకు సత్య, దయా, తపో, దానంబులు నాల్గుపాదంబులై నడచు.

14 కృష్ణుడు- ఉద్ధవున కుపదేశించినది.

నిరంతర భక్తియోగం బధికంబుగా నీ మనంబున నిలుపుము.

దేహాది మానంబు వర్జించి యైహికాముష్మిక సుఖంబుల గోరక మనంబు గుదియించి, ఏ ప్రొద్దు నన్ను దలంచువాడు వైకుంఠపద ప్రాప్తుడగు.

నేను నతని విడువంజాలక వెనువెంట నరుగుదు.

భక్తిభావన పరాయణుండై, కృపారసతత్పరుండై, మితభాషణుండై, బొంకక కర్మంబులు మదర్పణంబుగా జేసిన యతండు భాగవతుండు.

నా కథలను, మజ్జన పూజన, భోజన, శయనాసనాదికంబుల బరితుష్టులంజేసిన యతండు భాగవతుండు.

ఇట్లెంత కాలంబు జీవించు నంత కాలంబును నడపునతండు మద్రూపంబున వైకుంఠ నిలయంబునొందు.

15. మోక్షంబుకొఱకు నారాయణ భజనంబు పరమపావనము.

★ ★ ★ ★ ★

16. శ్రీకై వల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకుఁ గేళిలోలవిలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగ నాడింభకున్.

17. వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
బాలశశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వపర్వతో
న్మూలికి నారదాది మునిముఖ్య మనస్సరసీరు హాళికిన్.

18. ఆతత సేవసేసెద సమస్త చరాచర భూతసృష్టి వి
జ్ఞాతకు భారతీ హృదయసౌఖ్య విధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికరనేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిలతాపసలోక శుభప్రదాతకున్.

19. ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జన నందవేదికిన్
మోదక ఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్.

20. క్షోణితలంబు నెన్నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ సుందరవేణికి రక్షితానత
శ్రేణికిఁ దోయజాతభవ చిత్త వశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్యపాణికిన్.

21. అమ్మలఁగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడిపుచ్చినయమ్మ తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి ఈవుత మహత్త్వకవిత్వ పటుత్వసంపదల్.

22. హరికిన్ బట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు పూఁబోణి తా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ మన్నించునిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి సిరియిచ్చున్ నిత్యకల్యాణముల్

23. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెట వాటులంబడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

24. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని,
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు.

25. పలికెడిది భాగవతమఁట,
పలికించువిభుండు రామ భద్రుండఁట నేఁ
బలికిన భవహరమగునఁట.
పలికెద వేఱొండుగాథఁ బలుకఁగనేలా.

26. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు,
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత కన్నంత,
తెలియవచ్చినంత తేటపఱుతు.

27. లలితస్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితముఁ సువర్ణ సుమనస్సుజ్ఞేయముఁ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాలవాలంబునై
వెలయుఁ భాగవతాఖ్య కల్పతరు వుర్విఁ సద్ద్విజశ్రేయమై.

28. సూతుండు శౌనకాది మునులతో నారాయణ కథా ప్రశంస చేయుట.

నారాయణునకు నరునకు,
భారతికిని మ్రొక్కి వ్యాసపదములకు నమ
స్కారముసేసి వచింతును,
దారగ్రంథంబు దళిత తనుబంధంబుఁ.

29. భగవానుని ఏకవింశతి అవతారములు :

1) సుయజ్ఞుడు
2) వరాహ
3) నారదుడు
4) నరనారాయణ
5) కపిల
6) దత్తాత్రేయ
7) యజ్ఞుడు
8) ఉరుక్రముడు
9) పృథుచక్రవర్తి
10) మత్స్య
11) కూర్మ
12) ధన్వంతరి
13) మోహిని
14) నరసింహ

| | | | |
|---|---|---|---|
| 15) | వామన | 19) | రామకృష్ణ |
| 16) | భార్గవరామ | 20) | బుద్ధ |
| 17) | వ్యాస | 21) | కల్కి |
| 18) | రామ | | |

30. నారదుడు వ్యాసునితో :

ధాతవు భారతశ్రుతివిధాతవు వేదపదార్థజాత వి
జ్ఞాతవు గామముఖ్యరిపుషట్క విజేతవు బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు యోగినేతవు వినేతవు నీవు చలించి చెల్లరే
కాతరు కైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా?

31. నిర్గతకర్మంబైన నిరుపాధికంబైన జ్ఞానంబు గలిగినను హరిభక్తి లేకున్న శోభితంబుగాదు ఫలంబుగోరక కర్మమీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులైన జ్ఞానవాచా కర్మకౌశలంబులు నిరర్థకంబులు.

32. విష్ణుండు విశ్వంబు విష్ణునికంటెను వేఱేమియున్నలేదు
విశ్వమునకు భవవృద్ధి లయములా పరమేశుచేనగు.

33. ఈశ్వరునియందు సమర్పితంబైన కర్మంబు దాపత్రయంబు మాన్పు నౌషధంబగు. ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణా నిరుద్ధమూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి. నమస్కారంబు జేసి, మంత్రమూర్తియు శూన్యుండునైన యజ్ఞపురుషునిం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు.

34. సకలప్రాణి హృదంతరాళముల భాస్వజ్జ్యోతియైయుండు సూక్ష్మ కుఖండచ్యుతుఁడయ్యెన్........

35. కుంతి శ్రీకృష్ణుని స్తుతించుట :

శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మ సంకాశచరణ! హృషీకేశ! భక్తియోగంబునంజేసి సమస్కరించెద నవధరింపుము.

శా॥ శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

36. భీష్మస్తుతి :

మ॥ త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధు ప్రభమైన చేలముపయిన్ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుంజేరెడు వన్నెలాఁడు మదినావేశించు నెల్లప్పుడున్.

కం॥ తనవారిఁజంపఁ జాలక,
వెనుకకుఁబో నిచ్చగించు విజయుని శంకన్,
ఘన యోగవిద్యఁ బాపిన,
మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

సీ॥ కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి,
గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న,
జగముల వ్రేఁగున జగతిగదలఁ
జక్రంబుఁజేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటముజాఱ
నమ్మితి నాలావు నగుఁబాటు సేయక,
మన్నింపుమని క్రీడి మఱలఁదిగువఁ

తే॥ గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి.
నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁగాతు
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టిఁ.
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దానొక్కొక్కఁడై తోఁచు పో
లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండునట్టి హరినేఁ బ్రార్థింతు శుద్ధుండనై

ఉ॥ తండ్రులకెల్లఁ దండ్రియగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివి తల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ గురుండవే
తండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁజేసిరి? వేల్పులైననో
తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁగానరు మావిధంబునన్.

37. విదురుడు ధృతరాష్ట్రునితో :

దేహము నిత్యముగాదని,
మోహముదెగగోసి సిద్ధమునివర్తనుడై
గేహము వెలువడు నరుఁడు,
త్సాహముతోఁజెందు ముక్తిసంపద ననఘా.

38. ధర్మదేవతకు పాదములు :

కృతయుగమున – తపస్సు, శౌచము, దయ, సత్యము 4 పాదంబులు

త్రేతాయుగమున – తపస్సు, శౌచము, దయ

ద్వాపరమున – పాదద్వయంబు నశించె

కలియుగంబున – పాదత్రయంబు నశించె

39. కం॥ హరివార్త లెఱుఁగువారికి,
హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి,
మరణాగత మోహసంభ్రమము లేదనఘా!

48 పరీక్షిత్తు ఇట్లు విచారించుట .

కం॥ గోవులకున్ బ్రాహ్మణులకు,
దేవతలకు నెల్ల ప్రొద్దుఁ దెంపునఁగీడుం
గావించు పాప మానవు,
లే విధమునఁ బుట్టకుండ నే వారింతున్.

## 2

1. చతుశ్లోకి :

అహమేవాసమే వాగ్రే నాన్యదత్ సదసత్పరం ।
పశ్చాదహం యదేతచ్చ యోవ శిష్యేత సోస్మ్యహం

సృష్టికి పూర్వము నేనొక్కడినే యుంటిని. నాకంటె వేఱుగ స్థూలముగాని, సూక్ష్మముగాని వాని రెండింటికి కారణమగు ప్రధానము గానిలేదు. సృష్టికి పిమ్మటగూడ నేనొక్కడనే యుంటిని ప్రళయమునందు కూడ నేనే మిగులుదును.

ఋతేర్థం యత్ప్రతీయేత నప్రతీయేత చాత్మని ।
తద్విద్యాదాత్మనో మాయాం యధాభాసో యధాతమః ॥

భగవానుడు జ్యోతిర్మయ వస్తువైయున్నాడు. ఆయన మాయ రెండు విధములు 1. అభాసస్థానీయమగు జీవమాయ, 2. తమఃస్థానీయ మగు గుణమాయ.

రెండును భగవదాశ్రితములైనను భగవదంతరంగ ప్రతీతియందు జీవమాయ ప్రతీతి. రెండవది ఆకాశమండలమందలి నక్షత్రములలో రాహువువలె వెల్లడిగాదు

యధామహాన్తి భూతాని భూతేషూచ్చావచ్చేష్వను ।
ప్రవిష్టాన్య ప్రవిష్టాని తథాతేషు నతేష్వహం ॥

పృధివ్యాది మహాభూతములు. ఉచ్చనీచములైన దేవతిర్యగాది భౌతిక దేహములయందు సృష్ట్యనంతరము ప్రవేశించియు ప్రవేశింపనట్లు స్వతంత్రముగ నుండును. అట్లే నేనుగూడ భూతమయమగు జగత్తులో

సర్వభూతములయందు ప్రవేశించి యున్నవాడనైనను భిన్నమగు భగవత్స్వరూపముతో అన్నింటి లోపల బయట స్ఫురించుచున్నాను.

ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వ జిజ్ఞాసునాత్మనః ।
అన్వయవ్యతిరేకాభ్యాం యత్ స్యాత్ సర్వత్ర సర్వదా ॥

అనువృత్తి వ్యావృత్తి క్రమముతోను లేదా విధినిషేధముల ద్వారాను ఏది అంతట, ఎల్లప్పుడు నుండునో అదియే ఆత్మయని తెలిసి కొనవలెను.

★ ★ ★ ★ ★

## 2. శుకుడు పరీక్షితునకు ముక్తిమార్గము తెలుపుట :

ఆ॥ పశు కళత్ర పుత్ర బాంధవదేహాది,
సంఘమెల్లఁ దమకు సత్యమనుచు ।
గాపురములు సేసి కడపట జత్తురు.
కనియు గానరంత్యకాలసరణి ॥

కం॥ కావున సర్వాత్మకుడు మహావిభుడు విష్ణుడీశు డాకర్ణింపన్।
సేవింపను వర్ణింపను, భావింపను, భావ్యుడభవభాజికినధిపా!

ఆ॥ జనులకెల్ల శుభము సాంఖ్యయోగము దాని,
వలన ధర్మనిష్ఠవలననైన
నంత్యకాలమందు హరిచింత సేయుట,
పుటువునకు ఫలము భూనరేంద్ర!

ఆ॥ అరసి నిర్గుణబ్రహ్మంబు నాశ్రయించి,
విధినిషేధము లొల్లని విమలమతులు
సేవించుచుందురు హరిగుణ చింతనములు,
మానసంబుల నెప్పుడు మానవేంద్ర!

భాగవతమున విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లి.

ఆ॥ మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు,
భవభయంబులెల్ల బాసిపోవు
యోగి సంఘమునకు నుత్తమ వ్రతములు,
వాసుదేవ నామ వర్ణనములు,

కం॥ హరిమయము విశ్వమంతయు,
హరి విశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయముగాని ద్రవ్యము,
పరమాణువులేదు వంశపావన! వింటే,

. సీ॥ ఆసన్న మరణార్థియైన యతీశుండు
కాలదేశములను గాచికొనడు
తనువు విసర్జించు తలపు జనించిన
భద్రాసనస్థుడై ప్రాణపవను
మనసుచేత జయించి మానసవేగంబు
బుద్ధిచే భంగించి బుద్ధిదెచ్చి
క్షేత్రజ్ఞుతోఁ. గూర్చి క్షేత్రజ్ఞు నాత్మలోపల
జేర్చి యాత్మను బ్రహ్మమందు

తే॥ గలిపియొక్కటి గావించి గారవమున,
శాంతితోడ నిరూఢుడై సకలకార్య
నివహమెల్లను దిగనాడి నిత్యసుఖము,
వలయునని చూచు నటుమీదట వసుమతీశ.

దేహాదులం దాత్మత్వంబు విసర్జించి, యన్య సౌహృదంబుమాని, పూజ్యంబైన హరిపదంబును హృదయంబున నాలింగనంబుసేసి, వైష్ణవంబైన పరమ పదంబు సర్వోత్తమంబని సత్పురుషులు దెలియుదురు.

సీ॥ విష్ణుకీర్తనలు విననికర్ణంబులు
కొండల బిలములు కువలయేశ!
చక్రి పద్యంబులు చదవని జిహ్వలు
కప్పల బిలములు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు
కేకి పింఛాక్షులు కీర్తిదయిత
గమాలక్షి పూజకుగాని హస్తములు
శవము హస్తంబులు సత్యవచన!

ఆ॥ హరిపద తులసీదళామోద రతిలేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర!
గరుడగమను భజన గతిలేని పదములు,
పాదపముల పాదపటుల మనఘ!

సీ॥ నారాయణుని దివ్య నామాక్షరములపై
గరగని మనములు గఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు
రోమాంచ మిళితమైయుండని మేనుమొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల
నున్న కనకకిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవు
సిరి వనదుర్గ చంద్రికా వైభవంబు

ఆ॥ కైటభారి భజన గలిగియుండనివాడు
గాలిలోననుండి కదలు శవము
కమలనాభు పదముగనని వాని బ్రతుకు
పసిడికాయలోని ప్రాణిబ్రతుకు.

కం॥ శ్రీపతియు యజ్ఞపతియు ప్రజాపతియున్
బుద్ధిపతియు జగదధిపతియున్
భూపతియు యాదవశ్రేణీపతియుం
గతియునైన నిపుణు భజింతున్.

కం॥ విశ్వాత్ముడు విశ్వేశుడు విష్ణుమయం
డఖిలనేత విష్ణుండజుడీ
విశ్వములోఁ దానుండును, విశ్వము
దనలోన జాల వెలుగుచునుండన్.

కం॥ హరి భగవంతుఁ డనంతుడు
గరుణాంబుధి సృష్టి కార్యకారణహేతు
స్ఫురణుండ వ్విభునికంటెం
బరు డన్యుడు లేడు తండ్రి! పరికింపంగన్,

5. సంసారమగ్నులై కాయంబులందు మమత్వంబు సేయక భగవ దర్పణంబు సేసిన పుణ్యాత్ములు గొందరుగలరు :

శుకుడు, సనకాదులు. రుద్రుడు, ప్రహ్లాదుడు, స్వాయంభువ మనువు, అతనిపత్ని శతరూప, దత్పుత్రులు (ప్రియవ్రతోత్తానపాదులు), దత్పుత్రికలు, ప్రాచీనబర్హి, ఋభువు. సంగుడు, ధ్రువుడు, గాది, గయుడు, ఇక్ష్వాకు, దిలీపుడు, మాంధాత, భీష్ముడు, యయాతి. సగరుడు, రఘు, ముచికుందుడు, రంతిదేవుడు, ఉద్ధవుడు. సారస్వతోదంకులు, భూరిషేణ, శ్రుతదేవుడు, మారుతి, పిప్పలుడు, బలి, విభీషణుడు, శిబి, పార్థుడు, విదురుడు. అంబరీష, పరాశరుడు, అలర్కుడు, దేవల, సౌభరి, మిథిలేశ్వరుడు, అభిమన్యు, అష్టిషేణాదులు,

6. ఉ॥ కారణకార్య హేతువగు కంజదళాక్షునికంటె నన్యులె
వ్వారును లేరుతండ్రి! భగవంతుననంతుని విశ్వభావనో
దారుని సద్గుణావళు లుదాత్తమతిన్ గొనియాడకుండినన్
జేరవు చిత్తముల్ ప్రకృతిజెందని నిర్గుణమైన బ్రహ్మమున్

7. ఎవ్వాడు శ్రద్ధాభక్తి యుక్తుండై కృష్ణ గుణకీర్తనంబులు వినుచుం బలుకుచుండునట్టి వాని హృదయ పద్మంబునందు గర్ణ రంధ్ర మార్గంబున బ్రవేశించి, కృష్ణుండు విశ్రమించి, సలిలగతంబైన కలుషంబును శరత్కాలంబు నివారించు చందంబున నాత్మ గతం బయిన మాలిన్యంబు నపకర్షించు.

8. ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః
తాయదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః ॥

అను ప్రమాణంబున నారాయణ శబ్దవాచ్యుండు గావున నతని ప్రభావంబు వర్ణింప దుర్లభంబు.

9. ఉ॥ రామ! గుణాభిరామ! దినరాజకులాంబుధిసోమ! తోయద
శ్యామ! దశానన ప్రబల సైన్యవిరామ! సురారిగోత్ర సు
త్రామ! సుబాహు బాహుబలదర్పతమః పటుతీవ్రధామ! ని
ష్కామ! కుభృల్లలామ! గరకంఠ సతీసుతనామ! రాఘవా,

10. మ॥ నిరుపమ గుణజాలా! నిర్మలానంద లోలా!
దురిత ఘన సమీరా! దుష్టదైత్య ప్రహారా!
శరధిమద విశోషా! చారుసద్భక్తపోషా!
సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్ర పాత్రా!

3

1. తమ చిత్తము నాయందుంచి నన్నే యర్చించువారి యాయర్చన యెప్పుడును నిష్ఫలముకాదు.

2. కర్తృత్వాభిమానముచేతనే పురుషునకు జననమరణ రూప బంధన పారతంత్ర్యము లభించును.

3. పంచభూతములు = భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము.

పంచతన్మాత్రలు = గంధతన్మాత్ర, రసతన్మాత్ర, రూప తన్మాత్ర, స్పర్శతన్మాత్ర, శబ్దతన్మాత్ర

అంతఃకరణములు (4) మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము.

దశ ఇంద్రియము = కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము, వాక్కు, చేయి, పాదము, పాయువు, ఉపస్థ.

ఈ 24 తత్త్వములను— ప్రధాన కార్యాత్మకమగు బ్రహ్మమని చెప్పెదరు.

25 కాలము.

★ ★ ★ ★ ★

4. నారాయణ భజనంబు సమస్త దుఃఖ నివారణంబు.

5. **యజ్ఞ వరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతించుట :**

దేవ! జితం జితంతే పరమేశ్వర! జితయజ్ఞ భావన శ్రుతి శరీర నీకు నతిభక్తి మ్రొక్కెదమయ్య వరద!

6. **కర్దముడు తన కుమార్తెలను :**

మరీచికి కళను, అత్రికి అనసూయను, అంగిరసునకు శ్రద్ధను, పులస్త్యునకు హావిర్భువును, పులహునకు గతిని, క్రతువునకు క్రియను, భృగువునకు ఖ్యాతిని, వసిష్ఠునకు అరుంధతిని, అధర్వునకు శాంతిని ఇచ్చి పరిణయము గావించెను.

7. కర్దముడు, పరంబ్రహ్మంబును జిత్తంబున నిల్పి. అహంకారంబు విడిచి, మమత్వంబు నిరసించి, దయాగుణంబునం జేసి సకలభూతంబులందు, సమత్వంబు భజియించి, శాంతి శేముషి గరిష్ఠుండగుచు, ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుగా దలంపుచు భక్తియోగంబున భాగవత గతిం బొందె.

8. సీ॥ తలప బ్రాహ్మణులుత్తములు వారికంటెను
వేదవేత్తలు, వేదవిదులకంటె
విలసిత వేదార్థవిదులు వారలకంటె
సముదిత శాస్త్రసంశయమును మాన్పు

మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె
నిజధర్మ విజ్ఞాన నిపుణులరయ
వారికంటెను సంగవర్జిత చిత్తులు,
దగవారికంటె సద్ధర్మపరులు

తే॥ ధార్మికులకంటె సత్త్మోత్త్ముడు వినుము,
మత్సమర్పిత సకలకర్మ స్వభావ
మహిమలుగల్గి ఇతర కర్మములు విడిచి,
సమతవర్తించు నప్పుణ్యాతముడు ఘనుడు.

## 9. జీవి మరణించునపుడు :

సీ॥ అతిరోగ పీడితుండై మందమగు
జఠరాగ్నిచే మిగుల నల్పాశియగుచు
మెఱసి వాయువుచేత మీదికినెగసిన
కన్నులు, కఫమున గప్పబడిన
నాళంబును, గంఠనాళంబునను
ఘురఘురమను శబ్దంబు దొరయు బంధు
జనుల మధ్యంబున శయనించు, బహు
విధముల దన్నుఁ బిలువంగఁ బిలువలేక

తే॥ చటులతర కాలపాశ వశంగతాత్ము,
డగుచు బిడ్డల పెండ్లాము నరసిప్రోచు
చింత వికలములైన హృషీకములును,
గలిగి విజ్ఞానమున బాసి కష్టపడగుచు.

అంత మరణావస్థబొందు సమయంబున నతి భయంకరాకారు లును సరభసేక్షణులునునగు యమదూతలిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి, త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు యమపాశం, బులచే గళంబునబద్ధుండై శరీరంబువలన నిర్గమించి, యాతనా శరీరంబు నవలంబించి, బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమంబగు మార్గంబును బొంది, రాజభటులచే నీయమానుండగుచు దండంబున కభిముఖుండై చను నపరాధి చందంబున జనుచుండి.

చ॥ అనయము మూర్ఛనొందు శునకావళిచేతను భక్ష్యమాణుఁడై
యనుపమ కాలకింకర భయంకర తర్జనగర్జనంబులన్
మనముగలంగ దేహము సమస్తము కంపమునొందుగాఁ బురా
తనభవ పాపకర్మ సముదాయము చిత్తములో దలంపుచున్.

సీ॥ అనుపమ క్షుత్తృష్ణ లంతర్వ్యథలఁజేయ
ఝుంఝూనిల జ్వలజ్జ్వలనచండ
భానుప్రదీప్తితప్తంబై వాలుకా
మార్గానుగత తప్యమాన గాత్రుఁ
డై వీపుకశలచే నడువంగ వికలాంగు
డగుచు మార్గమునందు నచటనచట
జాలమూర్ఛిల్లి యాశ్రయశూన్యమగు
నీళ్ల మునుగుచు లేచుచు మొనసిపాప

తే॥ రూపమైన తమముచే నిరూఢుఁడగుచు
వెలయఁ దొంబదితొమ్మిదివేల యోజ
నముల దూరంబుగల యమనగరమునకుఁ,
బూని యమభటుల్ గొంపోవ బోవునంత.

ఇట్లు మహాపాపాత్ముఁడైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను, సామాన్యదోషి యగువాఁడు ద్విముహూర్తంబులను నేగి యాతనం బొందు. అందు

కం॥ పట్టుదురు కొఱవులనువడి,
బెట్టుదురసి పత్రికలను బెనుమంటల యం
దొట్టుదురు నోఁడలు నలియగ,
పట్టుదు రప్పాపచిత్తమత్తంబెలుచన్.

ఉ॥ ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్రగదాసిధారలన్
ద్రెంతురు పొట్టప్రేవులు వధింతురు మీద నిభేంద్రపంక్తి తొ
ప్పింతురు ఘోరభంగి గఱపింతురు పాములచేత బిట్టు ద్రొ
బ్బింతురు మీద గుండ్లు తినిపింతురు దేహముగోసి కండలన్.

10. పురుషులకునెల్ల మోహంబుబొందఁ జేయుదాన
పురుషులు సతుల సంగమంబు మాని, యోగవృత్తి
జరింపుచు నుండవలయు.

## 4

1. సాలోక్యము — (వైకుంఠవాసము)
సార్ష్టిము — సమానైశ్వర్యము
సారూప్యము — సమానరూపత్వము
సామీప్యము — నిత్యసమీపత్వము
సాయుజ్యము — ఏకత్వము

2. కర్తృత్వాభిమానము లేనివాడును సమదర్శియునగు పురుషునికంటె శ్రేష్ఠుడులేడు.

3. మహాత్ములయందు తితిక్షను, నీచులయందు దయను, సమానవ్యక్తులయందు మైత్రిని, సర్వప్రాణియందు సమత్వమును జూపువానిపై సర్వాంతర్యామియగు భగవానుడు ప్రసన్నుడగు.

4. నేనె (భగవంతుడె) సర్వకర్మలకేకైక ఫలభోక్త నని భావించి, నాకు (భగవంతునకు) సమస్త కర్మఫలముల నర్పించువారు, భగవత్ప్రసంగములచే కాలముగడుపువారునగు మానవులు గృహస్థ ఆశ్రమమందున్నప్పటికి గృహమువారి బంధనమునకు గారణముకాదు.

5. సాంగత్య ప్రభావము హద్దులేనిది. సాధుసాంగత్య ప్రభావముచేతనే ఈ జన్మమునందు జీవుడు భగవల్లీలా కథలను శ్రవణ కీర్తనాదులు చేయుటద్వారా సంసారమునుండి యుత్తీర్ణుడై పరమపదమును బొందగలడు.

★ ★ ★ ★ ★

6. దక్షాదులు నారాయణుని స్తుతించుట :

మాధవ! గోవింద! హరి! ముకుంద
చిన్మయాకార! నిత్యలక్ష్మీ విహార!
నిర్వికార! నిరంజన! నిష్కళంక!
నిరతిశయ, నిష్క్రియారంభ! నిర్మలాత్మ.
విశ్వసంబోధ్య! నిరవద్య! వేదవేద్య!
ప్రవిమలానంద! సంసారభయ విదూర!

7. నారదుడు ధ్రువునితో :

బూని సుఖదుఃఖముల నేది
దైవవశమున జేకుఱుదాన జేసి
డెందమున జాల సంతుష్టినొందుచుండ
విమల విజ్ఞానియన భువి వెలయుదెపుడు.

8. చతుర్విధ పురుషార్థ శ్రేయఃప్రాప్తికి హేతువు హరిపదయుగళము దక్క నన్యముగలదే?

9. లలిత శ్రీవత్స లక్షణ లక్షితుండు
సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి
పురుషలక్షణ యుక్తుండు పుణ్యశాలి
యసిత మేఘనిభశ్యాము డవ్యయుండు.

10. హార కిరీట కేయూర కంకణ ఘన భూషణుడాశ్రితపోషకుండు
లాలిత కాంచీకలాప శోభిత కటి మండలుండంచిత
కుండలుండు
మహనీయ కౌస్తుభమణి ఘృణి చారుగ్రైవేయకుం
డానందదాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ హస్తుడు
భవనప్రశస్తుఁడజుఁడుఁ

11. తే॥ గంధమసౌరభ వనమాలికాధరుండు
హతవిమోహుండు నవ్య పీతాంబరుండు
లలిత కాంచన నూపురాలంకృతుండు
నిరతిశయ సద్గుణుడు దర్శనీయతముడు.

12. కం॥ సరస మనోలోచన ముత్కరుడును
హృత్పద్మ కర్ణికానివసిత వి
స్ఫురదురు నఖమణి శోభిత,
చరణ సరోజాతుడతులశాంతుడు ఘనుడుఁ.

13. సురుచి ధ్రువునితో :

భగవంతుడెవ్వనిపై మైత్రి నటించు సత్కృపానిరతిఁ
బ్రసన్నుఁడగుచు నతనికి దమయంత ననుకూలమైయుండు
సర్వభూతంబులు సమతచేర్చి మహిదలపోయ నిమ్న
ప్రదేశమందు ననయంబు జేరు తోయములపగిది.

14. పృథుడు ఋషులతో :

కం॥ అతిపరిశుద్ధులు లజ్జా, న్వితులు
మహోదారు లధికనిర్మలు లాత్మ
స్తుతి పరనిందలు దోషము,
లతిహేయములని తలంతు రాత్మలనెపుడున్.

15. హరినుద్దేశించి ప్రచేతసులతో శంకరుడు (రుద్రగీత) :

సీ॥ పంకజనాభాయ, సంకర్షణాయ,
శాంతాయ, విశ్వప్రబోధాయ, భూత
సూక్ష్మేంద్రియాత్మనే. సూక్ష్మాయ,
వాసుదేవాయ, పూర్ణాయ, పుణ్యాయ, నిర్వి
కారాయ, కర్మనిస్తారకాయ, త్రయీ
పాలాయ, త్రైలోక్యపాలకాయ,
సోమరూపాయ, తేజోబలాఢ్యాయ,
స్వయంజ్యోతిషే, దురంతరాయ కర్మ

తే॥ సాధనాయ, పురాణపురుషాయ, యజ్ఞ
రేతసే, జీవతృప్తాయ, పృథ్వీరూప
కాయ. లోకాఖ్య, నభసేంతకాయ, విశ్వ
యోనయే, విష్ణవే, జిష్ణవే, నమోస్తు.

సీ॥ స్వర్గాపవర్గ సుద్వారాయ, సర్వ
రసాత్మనే, పరమహంసాయ, ధర్మ
పాలాయ, సద్హితఫలరూపకాయ,
కృష్ణాయ, ధర్మాత్మనే, సర్వశక్తి
యుక్తాయ, ఘనసాంఖ్య యోగీశ్వరాయ,
హిరణ్యవీరాయ, రుద్రాయ, శిష్ట
నాథాయ, దుష్టవినాశాయ, శూన్య
ప్రవృత్తాయ, కర్మణే, మృత్యవే వి

తే॥ రాట్ఛరీరాయ, నిఖిలధర్మాయ, వాగ్వి
భూతయే, నివృత్తాయ సత్పుణ్యభూరి
వర్చసేఽఖిల ధర్మదేహాయ, చాత్మ
నేఽనిరుద్ధాయ, నిభృతాత్మనే, నమోస్తు.

తే॥ సర్వసత్వాయ, దేవాయ, సన్నియామ
కాయ, బహిరంతరాత్మనే, కారణాత్మ
నే, సమస్తార్థ లింగాయ, నిర్గుణాయ,
వేధసే, శీతాత్మక స్సాధవే. నమోస్తు.

16. ప్రచేతసులు విష్ణువును స్తుతించుట :

తే॥ దేవదేవుడవును వాసుదేవుడవును
సర్వభూత నివాసివి సర్వసాక్షి
వైన నీకు నమస్కారమయ్య కృష్ణ ?

17. హరిచేబుట్టిన విశ్వము, హరియందె లయంబునొందు

18. నారాయణుడు, సర్వభూత దయాళువులును ఎంతమాత్రంబు సంభవించినంతమాత్రంబున సంతుష్ట చిత్తులును, సర్వేంద్రియోపశాంతులునగు పురుషులయెడ సంతుష్టుండగు,

## 5

1. సర్వప్రాణులయందును మైత్రిని జూపుము,
విషయాసక్తిని వీడి హరిసేవద్వారా
జ్ఞానముచే సంసారమార్గమున తరించుము.

2. అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల! మాటలు వేయునేల!

3. ఈ సంసారమున కౌటుంబికులు పేరునకు మాత్రము భార్యా బిడ్డలు కాని, పనికి తోడేళ్లు, నక్కలవంటివారు. తోడేళ్లు, పాలకులచే సంరక్షింపబడుచున్న మేకలను బలవంతముగ నపహరించును. అట్లే ఈ దారాపుత్రులు మిగులలోభియగు గృహస్థుచే ప్రయత్నపూర్వకముగ సంరక్షింపబడు ధనమును వాని యెదుటనే వానికిష్టము లేకపోయినను అపహరింతురు.

★ ★ ★ ★ ★

4. బ్రహ్మ ప్రియవ్రతునితో :

వనవాసియైనను జితేంద్రియుండు గాకుండెనేని సంసారబంధంబులు గలుగు. గృహస్థాశ్రమంబందును జితేంద్రియుండై యాత్మజ్ఞానంబు గల పురుషునకు మోక్షంబు సిద్ధించు. మోక్షార్థియగు పురుషుండు గృహాశ్రయుండగుచు శ్రీహరి చరణారవిందంబులను దుర్గంబాశ్రయించి యరిషడ్వర్గంబుల జయించు. ముక్తసంగుండవై భోగంబుల ననుభవించి ముక్తింజెందుము.

5. శుకుడు పరీక్షితునితో :

ధరఁ జండాలుండైనను, హరినామస్మరణఁ జెందు నవ్యయ పదముఁ.

6. వృషరాజుతో విప్రరూపముననున్న భరతుడు చెప్పుట :

చిత్తంబెంతకాలంబు విషయాసక్తంబగు, నంతదడ సంసార చక్రంబునందు సంచరించుఁ గావున మహావీరుండైనః

దనకు శత్రువైన మనంబు నప్రమత్తుండై, యుపేక్షా బుద్ధింజేసి యిచ్ఛా విహారంబున జరగనీక, పరమగురుండైన శ్రీహరి చరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం, బరతత్త్వంబు నొందు.

7. నరుడు వృద్ధసంసేవంజేసి సంసార మోహంబును బాసి హరిధ్యాన కథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజిం పుచుం బరలోకంబును బొందు.

8. నరదేవాసుర యక్షరాక్షస మునీంద్ర స్తుత్య! దివ్యాంబరా భరణాలంకృత భక్తవత్సల! కృపాపారీణ! వైకుంఠ మం దిర! బృందావన భాసుర ప్రియధరిత్రీనాథ! గోవింద! శ్రీ కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కళ్యాణ! గోపాలకా!

9. పరమపదవాస! దుష్కృత,
హర! కరుణాకర! మహాత్మ! హతదితిసుత! భా
సుర గోపికా మనోహర!,
సరసిజదళనేత్ర! భక్తజననుతగాత్రా!

10. సరస హృదయవాసా! చారు లక్ష్మీవిలాసా!
భరిత శుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమ ఘనగాత్రా! నిర్మల జ్ఞానపాత్రా!
గురుతర భవదూరా! గోపికా చిత్తచోరా!

11. శ్రీకాంతా హృదయ ప్రియ!
లోకాలోక ప్రచార! లోకేశ్వర సు
శ్లోక భవభయనివారక!
గోకులమందార! నందగోపకుమారా!

12. అనంతుడు పాతాళంబున నుండి సకలలోక హితార్థంబు భూమిని ధరియించు.

## 6

1. పాపియగు మానవుడు భగవద్భక్తుల సాంగత్యము, సేవల ద్వారా శ్రీ కృష్ణున కాత్మసమర్పణము చేసుకొనినచో పవిత్రుడగును.

2. ఈ ప్రపంచమున మంగళమయము, విఘ్నాది భయవిహీనము, శాస్త్రసమ్మతమునగు భక్తిమార్గమే నిజమగుమార్గము. ఈ భక్తి మార్గమునందే నారాయణ పరాయణులు, నిష్కాములునగు సాధువులు సంచరించుచుందురు.

3. ద్వాదశ మహాజనులు :

బ్రహ్మ. నారదుడు, శంభువు. సనత్కుమారుడు, కపిలుడు స్వాయంభువమనువు, ప్రహ్లాదుడు, జనకుడు, భీష్ముడు, బలి, శుకదేవుడు, యముడు!

ఈ 12 గురు మహాజనులకు మాత్రము భాగవత ధర్మ తత్త్వము తెలియును. దీనిని దెలిసికొనినచో జీవునకు భగవానుని పరమపదప్రాప్తి, ముక్తి లభించును.

నారాయణ కవచమును- విశ్వరూపుడు ఇంద్రున కుపదేశించెను.

4. మానవుడు అనిత్యమగు నీ దేహముద్వారా ధర్మము, కీర్తిని, సంపాదించుటకు ప్రయత్నము చేయనిచో- అతడు స్థావరములైన వృక్షాదులకంటెను జడుడేయగును,

5. ఇష్టములేకపోయినను వినాశకాలమురాగా. పురుషుని ఆయువు సంపద, కీర్తి, మున్నగువానికి హానికలుగును. అట్లే జయ కాలమునందు ప్రయత్నము లేకయే మానవున కాయువు, సంపద, కీర్తి లభించును.

6. పరమ మంగళాధి పతియగు శ్రీహరియందు భక్తిగలవాడు అమృతసాగరమున క్రీడించును. క్షుద్రమైన గుంటలోని నీటివంటి స్వర్గాదులచే వానికేమి ప్రయోజనము.

7. ఏదియో నొక నిందనీయమగు కార్యమొనర్చి ఐశ్వర్యాదులను బొందినను లజ్జాశీలుడగు వ్యక్తి వానివలన సుఖపడజాలడు.

8. అసంఖ్య జీవులలో మనుష్యజాతి మిగుల అల్పతరమైనది. దానిలో కొందరు ధర్మము ననుష్ఠింతురు. ధర్మానుష్ఠానము చేయువారిలో గొలదిమందే ముముక్షువులగుదురు. కోటి మంది ముక్తులలో నారాయణ పరాయణుడగు భక్తుడు మిగుల దుర్లభుడు.

9. దేహాభిమానమే సర్వక్లేశములకు మూలము.

10. పుత్రాది విషయములు కేవలము మానసికములైన రాగద్వేష జనిత పుణ్యపాపములకే నిమిత్తములగును అందువలన 'ఇది నేను ఇదినాది' అను అహంకార, మమకారమను అజ్ఞానము బరిత్యజించి సర్వాంతర్యామియగు వాసుదేవునియందు మనస్సు నుంచవలెను.

11. సంకర్షణస్తుతి- నారదుడు చిత్రకేతున కుపదేశించెను.

12. పుణ్యభూమియగు నీ భారతవర్షమున మానవ జన్మను బొందియు నేవ్యక్తి తన్ను దెలిసికొనజాలడో అతడొక ప్పుడు దేవాది జన్మలను బొందినను నిజమైన శ్రేయస్సును బొందజాలడు.

13. మానవులు ప్రాక్తన కర్మ ఫలమువలననే సుఖదుఃఖముల ననుభవించుచు భవాటవియందు సంచరించుచుందురు. అందువలన ఎవ్వరును మఱియొకరి సుఖదుఃఖములకు గారణముకారు.

కాని యజ్ఞానులగు మానవులు తమ్ము కర్తగా భావించి యభిమాన పడుదురు.

భగవానుడు స్వయముగ కర్త అయ్యును ఆ కర్తయే ఆయన సృష్ట్యాది వ్యాపారములయందు ఉదాసీనుడు. అంతట సమభావ విశిష్టుడై యున్నాడు. ఆయన మాయ యను శక్తియే జగత్సంబంధములగు క్రియలయందు నియుక్తమై జీవుల సుఖదుఃఖాదులకు కారణమగును.

14. స్త్రీలకు పతియే పరమదైవము. వివేకవతులు, పతివ్రతలు నగు స్త్రీలు తదేకచిత్తలై పరమ భక్తితో ఆత్మస్వరూపుడు, పతిరూపుడునగు నీశ్వరుని బూజించుచుందురు.

15. కుక్కలు, నక్కలు అనదగినవియు. స్వార్థోపయోగ శూన్యములైనవియు, క్షణభంగురములైనవియునగు ధన, పుత్ర, దేహములచే పరోపకారము చేయనిచో మానవుని జీవితము కేవలము దుఃఖభాజనమే యగును.

★ ★ ★ ★ ★

16. శా॥ శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారు వక్షస్థ్సల
శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షు గంజాత భూ
దేవేంద్రాది సమస్త దేవ మకుటోద్దీప్తోరు రత్నప్రభా
వ్యావిద్ధాంఘ్రి సరోజు నచ్యుతు గృపావాసుం
బ్రశంసించెదన్,

17. ఉ॥ మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం
బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా
హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచిత భక్తఫల ప్రదాయకున్
మోదముతోడ హస్తములు మోడ్చిభజించెద నిష్టసిద్ధికిన్

18. షష్ఠ్యంతములు :

కం॥ శ్రీపతికి మత్పతికి నుత.
గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం
తాప నివారణ మతికినిఁ,
బ్రాపితసనకాది తతికి బహుతర ధృతికిన్.

కం॥ హరికి గురు కలుషకుంజర,
హరికి భవాభీలహరికి సంతస్స్తుతగ
హ్వరికి నరిహరికి రక్షిత,
కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్.

కం॥ సణికి సమాశ్రిత చింతా,
మణికి మహేంద్రాది దివిజమండల చూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా.
ఫణికి నురోభాగ కౌస్తుభ ప్రియమణికిన్.

కం॥ కంసాసుర సంహారునకు,
కంసారచిత కర్ణకుండలతా భరణునకున్

హింసాపర పరమస్తక,
మాంసకరాశిత గరాభిమత హస్తునకున్.

కం॥ వరయోగి మానసాంతః,
కరణ సుధాంభోధి భావకల్లోల లస
త్పరతత్త్వ శేషశాయికిఁ,
జిరదాయికి సకలభక్త చింతామణికిన్.

19. హరిభక్తులతో మాటలు, ధరనెన్నడు జెడని
పుణ్యధనముల మూటల్
వరముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని
యరుదగు కోటల్.

20. **శుకుడు పరీక్షితునితో :**

శ్రీకృష్ణ పద పద్మంబులు హృత్పద్మంబుల నిలుపు వారలన్య పాపకర్మంబులగు నవిద్యా వ్యసనంబులంబొరయ నేరరు.

21. **దేవతలు నారాయణుని స్తుతించుట :**

పరమపురుష ! దుఃఖభంజన ! పరమేశ !
భక్తవరద ! కృష్ణ ! భవవిదూర !
జలరుహాక్ష ! నిన్ను శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావుమయ్య ! మమ్ము.

22. నమస్తే భగవన్నారాయణ ! వాసుదేవ ! ఆదిపురుష !
మహానుభావ ! పరమమంగళ ! పరమకళ్యాణ ! దేవ !

23. పురుషున కాయువు. శ్రీయును, కీర్తియు, నైశ్వర్యంబు

## 7

1. నవవిధ భక్తిమార్గములు :
శ్రవణం, కీర్తనం, విష్ణోఃస్మరణం, పాదసేవనమ్ ।
అర్చనం, వన్దనం, దాస్యం, సఖ్య, మాత్మనివేదనం ॥

2. ఈ ప్రపంచమున శ్రీ గోవింద భగవానుని యందేకాంత భక్తి, సర్వభూతములయందు భగవద్భావదర్శనము పరమ పురుషార్థములు.

3. పతివ్రత ధర్మములు : పతి శుశ్రూష, అనుకూలముగ నుండుట, అతని బంధువులపై శ్రద్ధ, పతి నియమమును పాటించుట.

4. ప్రవృత్తి పరాయణుడగు పురుషుడు- మరణించిన పిమ్మట యజ్ఞసంబంధములగు చరువు పురోడాశాది ద్రవ్యముల సూక్ష్మభాగముచే నేర్పడిన శరీరమును ధరించి ధూమాభిమానులగు దేవతలకడకు జేరును. పిమ్మట క్రమముగ రా। కృష్ణపక్షము, దక్షిణాయనము నభిమానించు దేవతలక

వెడలి చంద్రలోకమును జేరును. భోగములు పూర్తియైన పిమ్మట యచటనుండి అమావాస్య చంద్రునివలె క్షీణుడై వర్షముద్వారా క్రమముగ ఓషధుల రూపముగను, లతల రూపముగను, అన్నరూపముగను, వీర్యరూపముగను మార్పు చెంది పితృయాన మార్గముగుండా మరల ప్రపంచములో జన్మించును.

★ ★ ★ ★ ★

5. **ప్రహ్లాదుడు తన తండ్రితో :**

మలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వాజిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయిని మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభి నీధవు జెప్పెడి గురుడు గురుడు
దండ్రి! హరిజేరు మనియెడి తండ్రి తండ్రి.

6. సీ॥ కంజాక్షునకు గాని కాయంబు కాయమే?
పవన గుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే?
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనము లేని హస్తంబు హస్తమే?
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే?
తనుకుడ్యజాల రంధ్రములుగాక

ఆ॥ చక్రిచింత లేని జన్మంబు జన్మమే?
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే?
పాదయుగము తోడి పశువుగాక.

7. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు విష్ణుండు
సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు
ముముక్షుండగు దేహికి దేహావసాన పర్యంతంబు
నారాయణ చరణారవింద సేవనంబు కర్తవ్యంబు.

8. మ॥ కలడంబోధిఁ గలండు గాలిఁగలఁడాకాశంబునం
గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలంబగళ్ల నిశలన్ ఖద్యోత
చంద్రాత్మలన్

గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగ
వ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు దండ్రి! వెదకంగా
నేల యీ యాయెడన్.

9. కం॥ ఇందుఁ గలఁ డందులేఁడని,
సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన, నం
దందేగలడు దానవాగ్రణి! వింటే.

10. హరి సర్వాకృతులం గలండనుచు ప్రహ్లాదుండు భాషించె.

11. పురుషున కాయువు, శ్రీయును, కీర్తియు, నైశ్వర్యంబు మొదలయినవి యనుభవింప నెంతకాలంబు ప్రాప్తంబంత కాలంబు నివశించు. ఆ ప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలింబొందిన నవి యుండక పోవుచుండు.

## 8

1. వృక్షమూలమున జలమును పోసిన స్కంధము, శాఖలు మొదలగునవి తృప్తిచెందును. అట్లే పరమాత్మ స్వరూపు డగు విష్ణువుయొక్క యారాధనముద్వారా సర్వప్రాణుల యారాధనము సంపాదితమగును.

2. భగవన్నామ స్మరణయే సర్వవిపత్తులనుండి కాపాడును,

3. పయోవ్రతము- కశ్యపుడు అదితికి సత్పుత్రప్రాప్తికై ఉపదేశించినది. (ఫాల్గుణ శు॥ పాడ్యమి నుండి శు॥ త్రయోదశి వరకు చేయునది.)

4. ప్రారబ్ధ కర్మవశమున లభించిన దానిచే సంతుష్టుడగు వ్యక్తి సుఖముగనుండునట్లు- అజితేంద్రియుడు, అసంతుష్టుడగు వ్యక్తి ముల్లోకములను బొందినను సుఖముగ నుండజాలడు.

5. మానవ జన్మమందేవ్యక్తికైన- ఉత్తమ జన్మము. కర్మ, వయస్సు, రూపము, విద్య, ఐశ్వర్యము, ధనము మున్నగు వానివలన గర్వము కలుగక పోయినచో అదియే వానిపై గల భగవానుని యనుగ్రహమని భావింపవలెను.

* * * * *

6. గజేంద్రుని ప్రార్థన :

ఉ॥ ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపల నుండులీనమై
యెవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వడు మూలకారణం
బెవ్వఁ డనాది మధ్యలయుఁడెవ్వడు సర్వము దానెయైన వాఁ
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెద॥.

7. కం॥ లోకంబులు లోకేశులు,
లోకస్థులు, దెగినతుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వడు, నే
కాకృతి వెలుగునతని నే సేవింతున్.

8. ఆ॥ ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశ వ్రతాఢ్యులై కొల్తురెవ్వని
దివ్యపదము, వాడు దిక్కునాకు.

9. కం॥ కలఁడందురు దీనులయెడఁ,
గలడందురు పరమయోగి గణములపాలం,
గలఁడందురన్ని దిశలను, గలడు
గలండనెడువాడు గలడోలేఁడో.

10. తే॥ అఖిల రూపులుఁ దనరూపమైనవాడు
నాది మధ్యాంతములు లేక యడరువాడు
భక్తజనముల దీనుల పాలివాడు
వినడె చూడడె తలపడె వేగ రాడె.

11. కం॥ విశ్వకరు విశ్వదూరుని,
విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వనవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు,
నీశ్వరునిం బరమపురుషు నే భజయింతున్.

12. శా॥ లా వొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁ
ప్రాణంబుల్
తావుల్దప్పెను, మూర్ఛవచ్చె, దవునుఁ
డస్సెను, శ్రమంబడియెఁ
నీవేతప్ప నితః పరంబెఱుగ, మన్నింపందగుఁ
దీనునిఁ
రావే యీశ్వర! కావవే వరద! సంరంక్షింపు భద్రాత్మకా!

13. ఉ॥ ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్ష విపక్షదూర! కు
య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ!
యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విపుల
ప్రభావ! రా
వే, కరుణింపవే. తలఁపవే, శరణార్థిని నన్ను, గావవే.

14. మ॥ అలవైకుంఠపురంబులో నగరులో నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు
కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న
ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహిపాహి' యనఁగు
య్యాలించి సంరంభి యై.

15. మ॥ సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి
సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం మన్నింప డాకర్ణి కాం
తర ధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాద ప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహి యై.

16. మ॥ తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధ వ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుడు, వాని పొంతను ధనుః
కౌమోదకీ శంఖ చ
క్ర నికాయంబును, నారదుండు, ధ్వజనీకాంతుండు
దావచ్చి రె
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాల
గోపాలమున్

48. గజేంద్రుడు విముక్తుడాయెను :

ఆ॥ కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షు గొల్చుచు
నుభయనియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన
బ్రబలమైన విష్ణుభక్తి చెడదు.

18. ఈశ్వరుడు హాలహాలమును పానముచేసెను :

కం॥ పరహితము సేయునెవ్వడు,
పరమహితుండగున్ భూతపంచమునకున్
బరహితమె పరమధర్మము,
పరహితులకు నెదురులేదు పర్వేందుముఖీ!

19. పాలకడలిలో నైరావతాదులు జనియించుట :

1. హాలాహలము
2. సురభి (కామధేనువు)
3. ఉచ్చైశ్శ్రవము
4. ఐరావతము
5. కల్పవృక్షము
6. అప్సరసలు
7. చంద్రుడు
8. లక్ష్మి
9. కౌస్తుభము
10. వారుణి
11. ధన్వంతరి అమృత కుంభముతో

20. లక్ష్మి ఉద్భవించి హరిని వరించిన పిదప :

కం॥ హరిసూచిన సిరిసూడదు,
సిరిచూచిన హరియుజూడ సిగ్గునుబొందుఁ
హరియును సిరియును దమలో.
సరిచూపుల జూడ మరుడు సందడివెట్టెఁ.

21. హరుడు పద్మాక్షుని జూచి :

సీ॥ దేవ! జగన్మయ! దేవేశ! జగదీశ!
కాల! జగద్వ్యాపక స్వరూప!
యఖిల భావములకు నాత్మయు హేతువునైన
ఈశ్వరుడ నాద్యంతములను
మధ్యంబు లయలకు మఱి లోపలయు
లేక పూర్ణమై భూరి సత్య
మానంద చిన్మాత్ర మవికారమాద్య
మనన్య మశోకంబు నగుణమఖిల

తే॥ సంభవ స్థితి లయముల సంగరహిత
మైన బ్రహ్మంబు నీవ నీయంఘ్రియుగము
నుభయ సంగ విసృష్టులైయున్న మునులు
కోరి కైవల్యకాములై కొల్తురెపుడు.

22. శివుడు మోహిని రూపియైన విష్ణునెరిగి :

ఆ॥ కాము గెలువవచ్చు గాలారి గావచ్చు
మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాడువారి చూపు టంపఱ గెలువంగ
వశముగాదు త్రిపుర వైరికైన.

23. వామనుడు బలితో :

కం॥ వ్యాప్తిం బొందక వగవక,
ప్రాప్తంబగు లేశమైన బదివేలనుచున్
దృప్తిం జెందని మనుజుడు,
సప్త ద్వీపములనైనఁ జక్కం బడునే.

24. సీ॥ సంతుష్టు డీ మూడుజగములఁ బూజ్యుండు
సంతోషికెప్పుడు జరుగు సుఖము
సంతోషిగాకుంట సంసార హేతువు
సంతసంబున ముక్తిసతియు దొరకు
బూటపూటకు జగంబున యదృచ్ఛా
లాభ తుష్టిని దేజంబుతోనపెరుగు
పరితోషహీనతఁ బ్రభ చెడిపోవును
జలధార ననలంబు సమయునట్లు

ఆ॥ నీవు రాజువనుచు నిఖిలంబు నడుగుట
తగవుగాదు నాకుఁదగిన కొలఁది
యేను వేఁడికొనిన యీ పదత్రయమును
చాల దనక యిమ్ము చాలుచాలు.

25. బలి శుక్రునితో :

శా॥ కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వా రేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే భూమిపైఁ
బేరైనంగలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

శా॥ ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపైఁ గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁదై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

26. వామనమూర్తి విశ్వరూపమునొందుట :

శా॥ ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దానింతై నభోవీథిపై
నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై

మ॥ రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతమై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదుంచ ద్వస్త్రమై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండము
న్నిండుచోన్.

27. బలిచక్రవర్తి తన శిరమున పాదముంచి యనృతదోషమలంట కుండ కాపాడుమనుట :

ఆ॥ సూనృతంబు కాని నుడియదు నాజిహ్వ,
బొంకఁజాల నాకు బొంకులేదు
నీ తృతీయ పదము నా శిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ.

28. బలి వామనునితో :

సీ॥ చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు
కాంతలు సంసార కారణములు
ధనము లస్థిరములు దనువతి చంచల
కార్యార్థులన్యులు గడచు కాల
మాయువు సత్వర మతిశీఘ్ర మనికాదె
యనఘుండు దమతండ్రి నధికరించి
మాతాత సాధుసమ్మతుడు ప్రహ్లాదుండు
నీపాదకమలంబు నియతిఁజేరె.

తే॥ భద్రుఁ డతనికి మృతిలేని బ్రతుకు గలిగె
వైరులై కాని తొల్లి మావారు గాన
రర్థివై వచ్చి నీవు నన్నడుగు టెల్లఁ
బద్మలోచన! నాపుణ్యఫలము గాదె.

29. బలిచక్రవర్తితో శ్రీహరి యిట్లనియె :

సీ॥ సేమంబు నీకింద్రసేన మహారాజ!
వెఱవకు మేలు నీ వితరణంబు
వేలుపులందుండ వేడుక పడుదురు
దుఃఖంబు లిడుమలు దుర్మరణము
లాతురతలు నొప్పు లందుండువారికి
నొందవు సుతలమందుండు నీవు
నీపంపు సేయని నిర్జరారాతుల
నాచక్రమే తెంచి నఱకుచుండు

ఆ॥ లోకపాలకులకు లోనుగావక్కడ
నన్యు లెంతవార లచట నిన్ను
నెల్లప్రొద్దు వచ్చియేను రక్షించెదఁ
గరుణతోడ నీకు గానవత్తు.

## 9

1. ముక్తిని గోరువాడు: 1. దాంపత్యరతులగు వ్యక్తుల సాంగత్యమును పరిత్యజించవలెను. 2. ఇంద్రియములను బాహ్య విషయములయందు లగ్నము చేయరాదు. 3. నిర్జనమున ఏకాకిగనుండి అనంతుడగు శ్రీహరియందు మనస్సునుంచవలెను. 4. సాంగత్యము చేయదలచిన భగవద్ధ్యాన పరాయణులగు సాధువులతో సాంగత్యము చేయవలెను.

2. తీర్థక్షేత్రములను సేవించుట ద్వారా పృథ్వీ పర్యటనము మిగుల పుణ్యజనకము.

3. ఎవరివలన లభించిన ఈ దేహముతో పరమేశ్వరుని గూడ పొందుటకు అవకాశమున్నదో అట్టి ఈ దేహము పుట్టుటకు గారణుడైన తండ్రికి ప్రత్యుపకారము చేయవలెను.

తండ్రి యొక్క మనోభిప్రాయమును నెఱవేర్చు పుత్రుడు ఉత్తముడు.

తండ్రి యాదేశించినను అశ్రద్ధతో చేసినవాడు అధముడు.

తండ్రి యాదేశమును పాలించని పుత్రుడు తండ్రి యొక్క పురీషమువంటివాడు.

4. తల్లితోను, సోదరితోను, పుత్రికతోను గలసి ఒకే యాసనమున గూర్చుండరాదు. బలమైన ఇంద్రియములు విద్వాంసునికూడ అకర్షించును.

5. ఐహిక, పారలౌకిక, భోగ విషయములను అనిత్యములని యెఱింగి ఆ విషయములను చింతింపక, వాని ననుభవింపక ఉన్నవాడే ఆత్మదర్శియగును.

6. తల్లి కొలిమి తిత్తివంటిది కుమారుడు తండ్రికి సంబంధించినవాడు. జన్మనిచ్చినవాని యాత్మయే పుత్రరూపమున జన్మించును.

★ ★ ★ ★ ★

7. దుర్వాసుడు అంబరీషునిపై కోపించుట.

సీ॥ యమునలోఁ గృతకృత్యుఁడై వచ్చి
రాజుచే సేవితుండై రాజచేష్టితంబు
బుద్ధిలో నూహించి బొనుముడి మొగముతో
నదరెడి మేనితో నాగ్రహించి
రెట్టించి యాకలి కొట్టుమిట్టాడంగ
నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందఱుఁ గంటిరే
విష్ణుభక్తుఁడుగాఁడు వీఁడునన్నుఁ

తే॥ గుడువ రమ్మని మునుముట్టఁ గుడిచినాఁడు
ధర్మభంగంబు సేసి దుష్కర్ముఁడయ్యె
నైన నిప్పుడు సూచెద నన్ని దిశల
నేనుఁ గోపింప మాన్పువాఁడెవ్వఁడనుచు.

8. దుర్వాసునితో విష్ణువనుట :

ఆ॥ నాకు మేలుగోరు నా భక్తుఁడగువాడు
భక్తజనులకేన పరమగతియు
భక్తుడెందు జనిన బఱుతెంతు వెనువెంట
గోవువెంట దగులుకోడెభంగి.

9. కల్మాషపాదునితో బ్రాహ్మణ భార్య .

మానుషదేహము గలుగుట,
భూనాయక! దుర్లభంబు పుట్టిన మీదన్
దానము, పరోపకారము.
భూనుత కీర్తియును వలదె పురషునకెందున్.

10. శ్రీరాముని వర్ణించుట :

నల్లనివాడు పద్మనయనంబులవాడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాడు గడువిప్పగు వక్షమువాడు మేలుపైఁ
జల్లెడువాడు నిక్కిన భుజంబులవాడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడునైన రఘుసత్తముడీవుత మాకభీష్టముల్.

11. విగతప్రాణుడైన నిమి మునులతో :

అతిమోహాకులితంబు సాంద్ర మమతాహంకార మూలంబు సంతత నానా సుఖదుఃఖ పీడిత మనిత్యంబిట్టి దేహంబు సంకృతి నాకేటికి మీన జీవనము భంగిం భీతిబాహుళ్య మంచితరుల్ పెద్దలు దీనిఁ జేకొనరు సర్వేశుఁడ మదిఁ గొల్చెదన్.

12. సీత తండ్రియగు జనకుని పేరు- సీరధ్వజుండు :

నిమి కళేబరమునుండి పుట్టినవాడు జనకుడు,
విగతదేహుండు గావున వైదేహుండనియు,
మధనజాతుండు గావున మిథిలుండనియు,
అమ్మిథిలునిచే నిర్మితంబైనది గావున మిథిలా నగరంబనియు నామము.

13. జనకులు :

యోగీశ్వర ప్రసాదందున గృహస్థులై యుండియు, బంధవిముక్తులై, యాత్మజ్ఞానంబుగలిగి, నిరంతర బ్రహ్మానుసంధానము సేయుచునుందురు.

14. జమదగ్ని పరశురామునితో :

క్షమగలిగిన సిరిగలుగును,
క్షమగలిగిన వాణిగలుగు సౌఖ్యములెల్లన్
క్షమగలుగఁ దోన కలుగును,
క్షమకలిగిన మెచ్చుశౌరి సదయుడు తండ్రీ!

15. యయాతి దేవయానితో :

కామోపభోగ సుఖములం,
వేమాఱును బురుషుఁడనుభవింపుచునున్నం
గామంబు శాంతిఁ బొందదు,
ధూమధ్వజుఁడాజ్య వృష్టిఁ బ్రదుంగుడువడునే.

16. ఆ॥ అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన
పానుపెక్కఁజనదు పద్మనయన!
పరమ యోగి కైన బలిమిని నింద్రియ
గ్రామ మధికపీడఁ గలుగఁజేయు.

17. తృష్ణవీడి, నిర్విషయుండై, అహంకారంబు విడిచి, పర బ్రహ్మంబునందు చిత్తంబు చేర్చవలె, బ్రహ్మనిష్ఠా తత్పరుండై, ఆత్మవిదుండై సంసారనాశంబు దలంచినవాడె విద్వాంసుండు.

## 10

1. ఈ లోకమున మృత్తికచే చేయబడిన ఘటాది వస్తువులు వినష్టములగునట్లు పంచభూతాత్మకములగు దేహములు ఉత్పన్నములగును, నశించును. ఘటాదులు నష్టమైనను మృత్తిక నశింపనట్లు పంచభూతాత్మకములగు శరీరములు నశించినను జీవాత్మ తాను వికారముచెందదు.

2. సర్వజీవులు దైవాధీనములై తాము చేసుకొనిన కర్మఫలము ననుభవించుదురు.

3. సాధువులను బాధించినచో నది బాధించువాని ఆయువును, సంపదను. యశస్సును, ధర్మమును, స్వర్గాది లోకములను, శుభములను, సర్వవిధశ్రేయస్సులను వినాశము చేయును.

4. తపస్సుచే ఇంద్రియాదులు, దానముచే ద్రవ్యము, సంతోషముచే మనస్సు, భగవద్భక్తిచే ఆత్మవిశుద్ధమగును.

5. మంత్రవేత్తలగు బ్రాహ్మణులు యోగులు. వారు పలికిన ఆశీస్సు లెప్పుడును నిష్ఫలములుకావు. ఇది నిశ్చయము.

6. పరమేశ్వరుని శక్తిద్వారానే ప్రాణాది పదార్థముల వ్యాపారము కనబడును. కాని వీనికెట్టి స్వతంత్ర శక్తియులేదు.

7. ఈ శరీరము :

అన్నదాతదా!
గర్భాధానముచేసిన తండ్రిదా?
గర్భమును ధరించిన తల్లిదా?
మాతామహునిదా?
వెలయిచ్చి కొన్నవానిదా?
బలవంతముగ తీసికొనినవానిదా?
లేదా మరణించిన పిమ్మట దగ్ధముచేయు అగ్నిదా?

భక్షించు కుక్కదా?

తనదా?

ఎవరికి సంబంధించినదో నిర్ణయించుటకు వీలులేదు. అందువలన ఈ దేహమునందహంకార, మమకారములు గలిగి యుండరాదు.

8. అనాసక్త భావముతో, ఆత్మకృతమగు కర్మఫలమును అనుభవించుచు, భగవంతుని దయకై ప్రతీక్షించుచు, మనోవాక్కాయములచే నమస్కరించుచు, జీవితమును గడుపు వాడే ముక్తిని బొందుటకధికారియగును.

9. నినుగొల్చుభాగ్యంబు నాకు యీయవే! ఇప్పటి జన్మనందైన, నొండెందైననో ఈశ్వరా!

10, తన యాత్మయె సమస్త ప్రాణులకు ప్రియమైనది. ఆత్మ కంటె భిన్నములగు పుత్రధనాదులు ఆత్మకు గౌణభావమున ప్రియములగును. కాని వాస్తవముగగావు.

11, జీవుడు హరిసేవవలన ఉత్తమ స్వరూపమును బొందును.

12. పుత్రకళత్రాదులందు ఆసక్తులగు మూఢ మానవులు ప్రతి క్షణము క్షీణించుచున్న ఆయుస్సుయొక్క విషయమును దెలిసికొనజాలరు.

13. నిష్కపటభావముతో పతికి, అతనిబంధువులకు సేవచేయుట, సంతానమును పెంచుట స్త్రీల పరమ ధర్మము.

14. దైవబలమే పరమబలము. తన ఇచ్ఛ ననుసరించి యే పనియు నెరవేరదు.

15. ధర్మాదులైన సర్వప్రయోజనములను సాధించునట్టి ఈ శరీరము ఏ తల్లిదండ్రులనుండి పుట్టి రక్షింపబడినదో మానవుడు 100 సం॥లు జీవించియున్నను ఆ తల్లిదండ్రుల ఋణమును దీర్చుకొనజాలడు.

సామర్థ్యమున్నను, కుమారుడు దేహముతోను, ధనముతోను, తల్లిదండ్రులను బోషింపకపోయినచో పరలోకమున యమదూతలు వానిచే వాని మాంసమును దినిపింతురు.

16. సమర్థుడగు పురుషుడు తల్లిని, తండ్రిని, కులవృద్ధులను పతివ్రతయగు స్త్రీని, శిశువైన పుత్రుని, గురువును, బ్రాహ్మణుని, ఆశ్రితులను పోషింపకపోయినచో జీవించి యుండగనే మరణించినవాడగును.

17. మరణించునప్పుడు ఆ పరమేశ్వరుడగు శ్రీకృష్ణునియందు క్షణకాలము చిత్తము లగ్నమగుటచే కర్మపాశము దగ్ధమై జీవునకు పరమగతి కలుగును.

18. సాధువులు నిరంతరం పరానుగ్రహ పరాయణులై యుందురు.

19. ఈ జగత్తులో జీవులు ఒంటరిగనె జన్మింతురు. ఒంటరిగనే మరణింతురు. ఒంటరిగనే పుణ్యపాప ఫలములను బొందు చుందురు.

20. మానవుడు తమ వస్తువులని భావించి అధర్మము నొనరించి ఏ ప్రాణములను, ధనమును, పుత్రాదులను రక్షించుచు పెంచుచుండునో ఆ ప్రాణములు, ధనము, పుత్రాదులు తమకు భోగములు లభింపనపుడు అట్టి తెలివిలేని మానవుని వదలి పోవుదురు.

21. బ్రాహ్మణుడు స్వధర్మమునుండి భ్రష్టుడుకాక, లభించిన వస్తువుతో సంతుష్టుడైనచో ఆ ధర్మమే వాని సర్వాభీష్టము లను దీర్చునదియగును.

22. ప్రాణుల సుఖ, దుఃఖముల కెట్టి స్థిరత్వములేదు. జీవుడు భగ వానుని యిచ్ఛననుసరించి సుఖ, దుఃఖముల ననుభవించు చుండును.

23. అనుక్షణము ధ్యానించుటవలననే జీవునకు ధ్యేయ వస్తువు యొక్క సారూప్యము లభించును.

24. దైవమే అన్నింటికి మూలము: మనుష్య మాత్రుడు దైవము చేతిలో కీలుబొమ్మ.

భగవానుడే జీవులకు సంయోగ వియోగములను గలుగజేయుచుండును.

25. సాధువులు దర్శనమాత్రముచేతనే పవిత్రము చేయుదురు.

26. నిష్కామ భావముతో న్యాయార్జితమైన విత్తముతో జగదీశ్వరుడగు శ్రీహరిని ఆరాధించుటయే గృహస్థులకు శ్రేయస్కర మార్గము.

అధ్యయనము, సాధన, ప్రచారముద్వారా- ఋషిఋణము

మాతాపితల సేవ. సంతానోత్పత్తిద్వారా పితృఋణము.

యజ్ఞము, సత్కర్మద్వారా- దేవఋణము తీర్చుకొనవలెను.

27. అభిమానంబు బంధంబు. కర్తృత్వ మొల్లనివానికి హింసయు, సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన ఈశ్వరునికి వైషమ్యంబులేదు.

★ ★ ★ ★ ★

28. ఇంద్రుడు కృష్ణుని స్తుతించుట :

వాసుదేవ! కృష్ణ! వరద స్వతంత్ర వి
జ్ఞానమయ! మహాత్మ! సర్వపుణ్య
పురుష నిఖిల బీజ భూతాత్మక బ్రహ్మ!
నీకు వందనంబు నిష్కళంక!

29. మేనితోడనె పుట్టు మృత్యువు జనులకు.

30. పరులకు హింసలు గావింపవలదు.

31. నీ పాదమ్ములునమ్మిన నాపదలెక్కడివి జనులకు

32. కర్మము సుఖదుఃఖములకుకారణము.

33. పరమేశ్వరార్పణంబుగ, బరజనులకు భిక్షమిడిన
బరమ పదమున బరగెదరట.

34. సీ॥ జగతీశ! యోగీశ! సర్వభూతాధార!
సకలసంపూర్ణ! ఈశ్వర! మహాత్మ.
కాష్ఠగతి జ్యోతికైవడి నిఖిలభూతములందు
నొకడవై తనరు దీపు
సద్గూఢుడవు గుహాశయుఁడవు సాక్షివి
నీయంతవాఁడవు వై నీవు మాయఁ
గూడి కల్పింతువు గుణముల; వానిచేఁ
బుట్టించి రక్షించి ఘాలయదేయు

ఆ॥ దీవ ప్రపంచమెల్ల నిట్టి నీవిప్పుడు
రాజమూర్తులయిన రాక్షసులను
సంహరించి భూమిచక్రంబు రక్షింప
నవతరించినాఁడ వయ్య! కృష్ణ.

35. నారాయణ! దామోదర! నీరజదళనేత్ర! చక్రి! నిఖిలేశగదా
ధారణ! గోవింద! నమస్కారము యదుపుత్ర! నిత్య
కళ్యాణనిధీ॥

36. **బాణుడు శంకరుని స్తుతించుట :**

సీ॥ దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత!
వితతచారిత్ర! సంతతపవిత్ర!
హాలాహలాహార! యహిరాజ కేయూర!
బాలేందుభూష! సద్భక్తపోష!
సర్వలోకాతీత! సద్గుణ సంభూత!
పార్వతీ హృదయేశ! భవవినాశ!
రజతాచలస్థాన! గజచర్మ పరిధాన!
సురవైరి విధ్వస్త!శూలహస్త!

తే॥ లోకనాయక! సద్భక్తలోక వరద!
సురుచిరాకార! మనిజన స్తుతివిహార!
భక్తజన మందిరాంగణ పారిజాత!
నిన్ను నెవ్వడు నుతిసేయనేర్చు నభవ!

37. **శంకరుడు కృష్ణుని స్తుతించుట :**

తే॥ అవ్యయుండ వనంతుండ వచ్యుతుండ
వాది మధ్యాంత శూన్యుండ వఖిలధృతివి
నిఖిలమందెల్ల వర్తింతు నీవుదగిలి
నిఖిలమెల్లను నీయంద నెగడు గృష్ణ!

38. నృగుడు కృష్ణుని స్తుతించుట :

ఆ॥ కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!
యప్రమేయ! వరద! హరి! ముకుంద!
నిన్ను జూడగంటి నీకృపగనుఁగొంటి
నఖిలసౌఖ్య పదువులందగంటి,

39. చ॥ హరి భజియించు హస్తములు హస్తము లచ్యుతు
గోరిమ్రొక్కు త
చ్ఛిరము శిరంబు చక్రధరుజేరిన చిత్తముచిత్త మిందిరా
వరుగను దృష్టిదృష్టి మురవైరి నుతించిన వాణివాణి య
క్షరు కథలాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో
భువిన్.

40. కుచేలుని భార్య భర్తతో :

చ॥ వరదుడు సాధు భక్తజన వత్సలుఁ డార్తశరణ్యు
డిందిరా
వరుడు దయాపయోనిధి భగవంతుడు కృష్ణుడుఁ
దాఁగుశస్థలీ
పురమున యాదవ ప్రకరముల్ భజియింపఁగ
నున్నవాఁడు నీ
వరిగిన మిమ్ముఁజూచి విభుఁడప్పుడ యున్న
సమాన సంపదల్,

41. మునీంద్రులు కృష్ణునితో :

ఆ॥ కృష్ణ! మాధవ! గోవింద!
పద్మనాభ! భక్తపారిజాత!
దేవదేవ! యనుచుఁదివిరి చూచుచు మధు
రాభిముఖ్యులగు నరిగిరంత.

42. ఇంద్రసేన దానవుడు కృష్ణునితో :

నమోభగవతే హరయే పరమాత్మనే ముకుందాయ
సమస్త భక్తవరదాయనమః పురుషోత్తమాయ
కృష్ణాయ మునీంద్రవంద్య చరణాయ సురారిహరాయ సాంఖ్య
యోగాయ వినీల భాస్వదలకాయ రథాంగ ధరాయవేధసే.

43. బహుళాశ్వని కృష్ణుని స్తుతించుట :

కృష్ణ! పరమాత్మ యదుకుల క్షీరవార్ధి
పూర్ణచంద్రమ! దేవకీపుత్ర! సుజన
వినుత నారాయణాచ్యుత! వేదవేద్య!
భక్తజనపోష పరితోష! పరమపురుష!

44. భూసురుడు కృష్ణునితో :

నందనందన మునివినుత! నందనందన! పరమానంద
శరదిందుచందన. కుంద యశస్సాంద్ర! కృష్ణ!
గోవింద! హరీ!

## 11

1. మొదట దేహము, పుత్రుడు మున్నగు సర్వవిషయములందు మనస్సున కనాసక్తిని, సత్పురుషులతోడి సాంగత్యమును, హీన ప్రాణులపై దయను సమాన వ్యక్తులతో మైత్రిని, ఉత్తమ పురుషులపట్ల వినయమును అభ్యసింపవలెను.

2. సమస్తము బ్రహ్మమే. బ్రహ్మయొక్క శక్తి అనంతమైనది. దృశ్యాదృశ్యములు కార్యకారణములు, సత్యాసత్యములు- సర్వము బ్రహ్మమే.

3. అగ్నిని, సూర్యుని, జలమును, అతిథిని తన హృదయమునన్నున్న సంసారబంధ వినాశకుడగు శ్రీహరిని అర్చించు మానవుడు వెంటనే ముక్తినిపొందును.

4. చంపబడిన పశువులు పరలోకమున ఆ చంపినవానిని భక్షించును.

5. నామ సంకీర్తనవలననే పరమశాంతి కలుగును. ప్రాపంచిక దుఃఖము నశించును,

6. అనన్యభావముతో భగవానుని పదయుగళమును ఆరాధించు ప్రియభక్తుని హృదయమున ఏ విధమగు వికర్మప్రవృత్తి పుట్టినను వాని హృదయమునందున పరమేశ్వరుడగు శ్రీహరి వానినన్నింటిని నాశనముచేయును.

7. దేవా! త్రిలోకములయందలి పాపరాశిని క్షాళనముజేయుటకు నీవు రెండు పవిత్ర నదులను ప్రవహింపజేసితివి.

వానిలో 1. అమృతమయమగు నీ లీలతో నిండిన కథానది.

2. నీ పాదప్రక్షాళన జలముతో నిండిన గంగానది.

వివేకవంతులగు పురుషులు కర్ణములచే నీ కథానదిలోను, శరీరముచే గంగానదిలోను మునకలువేసి రెండు తీర్థములను సేవించుచు తమ పాపతాపములను నశింపజేసుకొనుచున్నారు.

8. జ్ఞాన. విజ్ఞాన సంపన్నుడు, శాంతుడు, సమదర్శియునగు పురుషుడు ఈ విశ్వమును నా స్వరూపమని తెలుసుకొనును. దానిచే నతడు మఱల ఈ జననమరణ చక్రమునందు జిక్కుకొనడు.

9. ఎచ్చటను నెవ్వరితోడను అతిస్నేహము, అతిప్రసంగము చేయరాదు.

10 బుద్ధిమంతుడగు మానవుడు శాస్త్రముల నన్నింటినుండి సారమును గ్రహింపవలెను.

11. వివేకియగు మానవుడు, ఎప్పుడును మృత్యువుతో సమానమైన స్త్రీ సంసర్గమును వాంఛింపరాదు.

12. మానవుడు వైరాగ్యముచేతనే గృహాది బంధనముల నన్నింటిని ఛేదించుకొని శాంతిని పొందును.

13. లోభియైన మానవుడు అతికష్టముతో ధనమును కూడ బెట్టును. దానినెవ్వరికి దానముచేయడు. తాను స్వయముగ ననుభవింపడు. లోభియగువాని ధనమును లోకులనుభ వింతురు.

14. ప్రియాతిప్రియములైన వస్తువులందాసక్తి గలిగియుండు టయే మానవుల దుఃఖకారణము.

15. అనేక జనులొకచోట నున్న కలహము. ఇరువురున్న నానా విధ విషయచర్చ జరుగును. అందువలన ఒంటరిగ సంచ రింపవలెను.

16. అహంకరించుట తగదు.

17. పాలనీయని ఆవు, వ్యభిచారిణియగు స్త్రీ, పరాధీన శరీరము, దుష్టపుత్రుడు, సత్పాత్రుడులభించినను దానముచేయని ధనము, భగవద్గుణకీర్తనలేని వాక్కు వ్యర్థము. ఈ వస్తు వులను కాపాడువాడు కష్టముల ననుభవించును.

18. నా కథను వినుటయందు శ్రద్ధ చూపవలెను. నిరంతరము నన్ను ధ్యానించుచుండుము. లభించిన పదార్థమును నాకు సమర్పింపుము. దాస్యభావముతో నాకు ఆత్మనివేదనము చేయుము.

19. సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు, గోవు, వైష్ణవులు, ఆకాశము, వాయువు, జలము, పృథ్వి, ఆత్మ, సర్వప్రాణులు ఇవి అన్నియు నా పూజాస్థానములు.

20. సమదర్శనముద్వారా సర్వభూతములయందు అంతర్యామి స్వరూపుడగు నన్నారాధింపుము.

21. ఉద్ధవా! నేను సత్పురుషులకు పరమాశ్రయుడను. సత్సంగమువలన గలిగిన భక్తియోగము తప్ప మతే యుపాయము మానవుని సంసారమునుండి తరింపజేయజాలదు.

సత్సంగము లోకములోని సర్వవిధములగునాసక్తులను నాశముచేయును. ఇది నన్ను వశముచేసికొనునట్లుగ మరియేయితర సాధనములు నన్ను వశము చేసికొనజాలవు.

22. అహింస, సత్యము, అస్తేయము, అకామము, అక్రోధము, అలోభము, సర్వభూతప్రీతి, సర్వభూత హితకామన- ఇవి సర్వమానవుల ధర్మములు.

23. గృహస్థుడు భగవత్సేవయందెప్పుడును సావధానుడై యుండవలెను. విద్వాంసుడగు పురుషుడు స్వర్గాదిపార లౌకిక భోగములను ఐహిక భోగములవలె నశ్వరములని తెలిసికొనవలెను.

24. పుత్రులు, భార్య, ఆప్తులు, బంధువులు, మున్నగువారితోడి సమాగమము చలివేంద్రములో బాటసారులతోడి సమాగమమువలె క్షణికమని తెలిసికొనుము.

25. ఈ శరీరముతో జేయు కార్యములను నన్నుద్దేశించియే చేయవలెను. వాక్కుతో నా గుణములనే కీర్తింపవలెను. తన మనస్సునుగూడ నాయందే అర్పింపవలెను. సర్వకామములను పరిత్యజింపవలెను.

24. బుద్ధి నాయందు(భగవానుని) లగ్నముచేయుటయే- శమము
ఇంద్రియ నిగ్రహమే- దమము
దుఃఖములను సహించుటయే- తితిక్ష
జిహ్వను, జననేంద్రియములను జయించుటయే- ధైర్యము
ఎవ్వరికి ద్రోహము చేయకుండుట- దానము
కోరికలను త్యాగము చేయుటయే- తపస్సు
వాసనలను నిరోధించుటయే- శౌర్యము
బ్రహ్మవిచారమే- సత్యము
సత్యము, ప్రియవాక్కు- ఋతము
కర్మలయందనాసక్తుడై యుండుటయే- శౌచము
కోరికలను త్యజించుటయే- నిజమగు సన్న్యాసము
ధర్మమే మానవుల కభీష్టమగు- ధనము

నేనే- యజ్ఞమును

జ్ఞానము నుపదేశించుటయే- దక్షిణ

ప్రాణాయామమే- శ్రేష్ఠమగు బలము

నా ఐశ్వర్యమే- భగము

నా శ్రేష్ఠభక్తియే- ఉత్తమ లాభము

ఆత్మయందు ప్రతీయమానమగు భేదమును

తొలగించుటయే- నిజమగువిద్య

అకర్మలయందు హేయత్వమును దర్శించుటయే- లజ్జ

నిరపేక్షతాది గుణములే- శ్రీ

సుఖదుఃఖముల నతిక్రమించుటయే- సుఖము

విషయ భోగములను గోరుటయే- దుఃఖము

బంధమోక్షముల తత్త్వము నెఱుంగువాడె- పండితుడు

శరీరాదులయందు నాదియను భావముకలవాడు- మూర్ఖుడు

ఐహికములనుండి మరలించి నన్ను పొందించునదియే-

సత్పథము

సత్త్వగుణాభివృద్ధియే- స్వర్గము

తమోగుణాభివృద్ధియే- నరకము

జగద్గురువగు నేనే- బంధువును

ఈ మానవ శరీరమే- గృహము

గుణవంతుడగు పురుషుడు- ధనవంతుడు

సంతుష్టిలేనివాడె- దరిద్రుడు

జితేంద్రియుడు కానివాడె- కృపణుడు

విషయములందాసక్తుడు కానివాడె- స్వతంత్రుడు

విపరీతముగ విషయాసక్తుడైనవాడు- అస్వతంత్రుడు

27. ఈ మానవ దేహము జ్ఞాన, భక్తిరూపమగు పురుషార్థము నిచ్చునదైనను. అది వినాశ స్వభావము గలదియని తెలిసి కొని పురుషుడప్రమత్త భావముతో మృత్యువు సమీపించుటకు పూర్వమే ముక్తికై ప్రయత్నము చేయవలెను.

28. నాయందలి భక్తిచేతనే సర్వవిషయములందు సిద్ధికలుగును.

29. నిరపేక్షుడు, నిష్కాముడునగు వ్యక్తి- నా భక్తిని పొందగలడు.

30. రాగాది రహితులు, సర్వత్ర సమబుద్ధిగలవారు,
నాయందు ఏకాంత భక్తిగలవారు.

మాయాతీతమైన భగవద్వస్తువును బొందినవారునగు భక్తులకు విధినిషేధములవలన గలుగు పుణ్యాపాపములతో నెట్టి సంబంధముండదు.

31. విషయచింతనము జీవులను మొదట విషయాసక్తులనుగా జేయును. ఆసక్తివలన కామము, కామమువలన కలహము కలుగును. కలహమువలన దుస్సహమగు క్రోధము కలుగును. క్రోధము ననుసరించి మోహముండును. మోహమే మానవుని కార్యాకార్యములను నిర్ణయించు చేతనాశక్తిని గ్రసించును.

కార్యాకార్యజ్ఞాన శూన్యుడగు జీవుడు అసత్తుల్యుడగును. అపుడు చేతనా రహితుడు, మృతునివలె భ్రష్టుడగును.

32. జీవుడు కర్మవలన సత్త్వగుణాధిక్యముచే ఋషి, దేవతాది జన్మలనెత్తును.

రజోగుణ ప్రాబల్యముచే–అసుర, మానవుల జన్మలనెత్తును.

తమోగుణ ప్రాధాన్యముచే–భూత, ప్రేత, తిర్యక్ జన్మలనెత్తును.

33. శ్రేయస్కాముడగు వ్యక్తి ధైర్యముతో వివేకము నవలంబించి తన్ను ఉద్ధరించుకొనును.

భగవచ్ఛరణముల నాశ్రయించిన భగవద్ధర్మ నిరతులగు శాంతపురుషులను తప్ప ఇతర విద్వాంసులనుగూడ బలవంతమగు ప్రకృతి లొంగదీసికొనును.

34. భగవచ్చరణములయందు బుద్ధిని లగ్నముచేసి మనస్సును పూర్తిగ నిగ్రహింపవలెను. సమస్తసాధనల సారమిదియే.

35. అన్నము ప్రాణులకు జీవనము

ఆర్తులకు రక్షకుడను- నేను

ధర్మము పరలోకమున మానవులకు- ధనము

సత్పురుషులు సంసారమున భయపడు వ్యక్తులకు-
పరమరక్షకులు

36. సత్పురుషులే జీవులకు దేవతలు, బంధువులు. ఆత్మయునై యున్నారు. స్వయముగ నేనే సత్పురుషుని రూపమున నున్నాను.

★ ★ ★ ★ ★

37. **ఋషభ కుమారుడగు కవి- విదేహునకు ఉపదేశించుట :**

సకల జంతు సంతానంబుకంటె మానుషాకారంబు నొందుట దుర్లభంబు. అంతకంటె నారాయణ చరణ యుగళ స్మరణ పరాయణులగుట దుష్కరంబు.

38. **పరమపదమెట్లు గలుగు ?**

కం॥ కరణత్రయంబుచేతను,
నరుడే కర్మంబుసేయు నయ్యైవేళ
హరి కర్పణమని పలుకుట.
పరువడి సుజ్ఞానమండ్రు పరమమునీంద్రుల్॥

39. సీ॥ సంతతంబును గృష్ణ సంకీర్తనంబులు
వీనులకింపుగా వినఁగవలయు
హరినామ కథనంబు హర్షంబుతోడుత
బాటల నాటలఁబరఁగవలయు
నారాయణుని దివ్య నామాక్షరంబులు
హృద్వీథి సతతంబు నెన్నవలయు
గంజాక్షులీలలు గాంతారములనైన
భక్తియుక్తంబుగా బాడవలయు

తే॥ వెఱ్ఱిమాడ్కిని లీలతో విశ్వమయుని
నొడువుచును లోక బాహ్యత నొందవలయు
నింతయును విష్ణుమయమని యెఱుఁగవలయు
భేదమొనరింపవలదు మేదినీశ!

40. **భాగవత చిహ్నములెవ్వి ?**

సర్వభూతమయుండైన సరసిజాక్షు
డతడె తనయాత్మ యందుండు ననెడివాడు
శంఖచక్రధరుండంచు జనెడువాడు
భక్తిభావాభిరతుడువో భాగవతుడు॥

41. **భాగవతోత్తమ ధర్మంబులు :**

**(ప్రబుద్ధ పిప్పలాహ్వాయులు చెప్పెడు ఉపదేశము)**

1. విష్ణుభక్తి భావంబుగల సద్గురుల ప్రతిదినమును భజించుట.

2. సాత్త్వికంబును, భూతదయయును, హరికథామృత పానంబును, సజ్జనమైత్రియు, వినయసంపత్తియు, శుచిత్వంబును, తపంబును, క్షమయు, మౌనవ్రతంబును. వేద శాస్త్రాధ్యయన తదర్థానుష్ఠానంబును, నహింసయు, సుఖ దుఃఖాది ద్వంద్వ సహిష్ణుతయు, నీశ్వరుని సర్వగతునిగా భావించుటయు, ముముక్షత్వంబును, జనసంగ వర్జనంబును, వల్కలాది ధారణంబును, యదృచ్ఛాలాభసంతుష్టియు, వేదాంత శాస్త్రార్థ జిజ్ఞాసుత్వంబును, దేవతాంతర నిందా వర్జనంబును, సత్యవాక్యతయు, శమదమాదిగుణ విశిష్టత్వంబును, గృహారామక్షేత్రకళత్ర పుత్రవిత్తాదుల హరి కర్పణంబుసేయుట, నితరదర్శన వర్జనంబుసేయుటయును, భాగవతోత్తమ ధర్మంబులు.

## 42. ఆవిర్హోత్రద్రమీళులు తెలుపు పరమార్థోపదేశము :

మోక్షంబు నపేక్షించువాడు విధిచోదిత మార్గంబున హరిం బూజింపవలయు.

### పూజా ప్రకారంబు :

పవిత్రగాత్రుండై, జనార్దను సన్నిధిం బూతచిత్తుండై, విధ్యుక్త ప్రకారంబున చక్రధరుని ధ్యానించి, గంధపుష్ప ధూపదీప నైవేద్యంబులు సమర్పించి సాష్టాంగప్రణామంబు లాచరించి, భక్తిభావనా విశేషుండగునతడు హరింజేరు.

## 43. శ్రీకృష్ణుడు ఉద్ధవునకుపదేశించుట :

జీవజాలంబులలోన ద్విపాదంబులుగల మనుష్యులు మేలు. వారలలోన నిరంతర ధ్యానగరిష్ఠులైన యోగీంద్రు

లుత్తములు నన్ను సత్త్వగుణ గ్రాహ్యునిగా నెఱిగి, జీవాత్మ పరమాత్మలనేకంబుగా జేసి, శంఖ, చక్ర గదాది ఆభరణ యుక్తుండుగా దలంపుచునుండువారలు పరమయోగీంద్రుల నియును పరమ జ్ఞానులనియును జెప్పె.

44. అవధూతయదు సంవాదనము :

పరధన పరదార పరదూషణాదుల,
బరవస్తు చింత దా బరిహరించి
ముదిమిచే రోగము లుదయింప,
కటమున్న తనువు చంచలతను దగులకుండ
బుద్ధి సంచలతచే బొదలక,
యటమున్న శ్లేష్మంబు గళమున జేరకుండ
శక్తియుక్తులు మదీ సన్నగిల్లకమున్న,
భక్తిభావనచేత బ్రౌఢుడగుచు.

తే॥ దైత్యభంజను దివ్య పాదారవింద
భజన నిజభక్తిభావన బ్రాజ్ఞుడగుచు
నవ్యయానందమును బొందు ననుదినంబు
నతడు గర్మవిముక్తుడౌ ననఘచరిత ।

45. నిరంతరంబు నన్నేమఱక తలంచునతండు నాకుంబ్రియుండు.

46. దేహాభిమానంబు వర్జించి,
ఐహికాముష్మిక సుఖంబులగోరక,
మనంబుగుదియించి, ఏప్రొద్దు
నన్నుదలంచువాడు- వైకుంఠ పదప్రాప్తుండగు,
నేనతనిని విడువంజాలక వెంటనరుగుదు.

47. పూర్వభవ కర్మాధీనమై ప్రాణులకు
గీడుకు మేలునుజెందు లేదొకడు శిక్షింపంగ రక్షింప.

48. **జరాసంధుని చెరలోవున్న రాజులు. కృష్ణుని స్తుతించుట :**
వరద! పద్మనాభ! హరి! కృష్ణ! గోవింద!
దాస దుఃఖనాశ! వాసుదేవ!
యవ్యయాప్రమేయ! యనిశంబు గావింతు
మిందిరేశ! నీకు వందనములు.

## 12

1. కృతయుగమున ధ్యానముచేత, త్రేతాయుగమున యజ్ఞము చేత. ద్వాపరమున అర్చనముచేత లభించునది కలియుగ మున నొక్క హరికీర్తనమువలననే లభించును.

2. జీవులందఱు ప్రారబ్ధ కర్మఫలము ననుభవించుచుందురు.

3. జగదంతర్యామియు, ఆదికర్తయు. అద్వితీయుడునగు శ్రీహరియే సూర్యరూపమున ప్రకాశితుడగుచుండును. వైశాఖ క్రమమున 12 సూర్యనామములు :

| | | |
|---|---|---|
| 1. అర్యముడు | 5. వివస్వానుడు | 9. అగుడు |
| 2. మిత్రుడు | 6. త్వష్ట | 10. పూష |
| 3. వరుణుడు | 7. విష్ణువు | 11. పర్జన్యుడు |
| 4. ఇంద్రుడు | 8. అంశుడు | 12. ధాత |

4. మానవుడు తద్గతచిత్తుడై ప్రతిదినము, ప్రతియామము, ప్రతిక్షణము, ఇతరులకడ దీనిని (భాగవతమును) కీర్తించి నను, లేదా శ్రద్ధాయుక్తుడై దీనిలోని ఒక శ్లోకమును, శ్లోకార్ధమును, శ్లోక చతుర్థభాగమును. శ్లోకాష్టభాగమును అను క్షణము శ్రవణము చేసినచో నతడు తన్నుతాను పవి త్రునిగ జేసికొనును.

5. మానవుడు ద్వాదశినాడు లెదా ఏకాదశినాడు దీనిని శ్రవణము చేసినచో దీర్ఘజీవియగును. ఉపవాసియు, ఏకాగ్రచిత్తుడునై పఠించిన సర్వపాప విముక్తుడగును,

6. పుష్కరమునందు, మధురయందు, ద్వారకయందు, ఉప వాసముండి సంయతచిత్తముతో నీ భాగవత సంహితను బఠించిన సర్వభయ విముక్తుడగును,

7. యంబ్రహ్మో వరుణేన్ద్రరుద్ర మరుతః స్తున్వన్తి దివ్యైస్తవై ర్వేదైః సాఙ్గ పదక్రమోపనిషదై ర్గాయన్తియం సామగాః ధ్యానావస్థిత తద్గతేన మనసాపశ్యన్తియం యోగినో యస్యాన్తం న విదుః సురాసురగణా దేవాయ తస్మైనమః

8. శ్రీమద్భాగవత పురాణమును దానముచేసినవాడు పరమగతిని బొందును,

9. భాద్రపద మాసమున పూర్ణిమా తిథియందు సువర్ణసింహాసనమునబెట్టి శ్రీమద్భాగవత పురాణమును దానముచేసినవాడు పరమగతిని బొందును.

10, కం॥ ధర్మము, సత్యము, గీర్త్తియు,
నిర్మలదయ, విష్ణుభక్తి, నిరుపమఘన స
త్కర్మ, మహింసావ్రతము,
న్నర్మిలి గలవారె పుణ్యులవనీ నాథా!

చ॥ మృతియును, జీవనంబు నివి మేదిని లోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహజం బిదె చోరహుతాశ సర్పసం
హతులను దప్పి యాకటను బంచత నొందెడు నట్టి జీవుడున్
వెతలను బూర్వకర్మభవ వేదనలొందుచు గుందునెప్పుడున్.

12. పరనిందసేయక, వైరంబువర్జించి, భగవత్పదాంభోజ భక్తి సంయుక్తుండై తిరుగునతడును, హరిపదంబుజేరు.

13. తే॥ పుష్కరంబందు ద్వారకాపురమునందు
మథురయందును రవిదినమందు నెవడు
పఠనసేయును రమణతో భాగవతము
వాడు దరియించు సంసార వార్ధినపుడు.

# నారాయణ కవచమ్

రాజోవాచ :-

యేన గుప్తస్సహస్రాక్షస్సవాహాన్ రిపుసైనికాన్,
క్రీడన్నివ వినిర్జిత్య త్రైలోక్యం బుభుజే శ్రియమ్. 1

భగవంస్తన్మమాఖ్యాహి వర్మనారాయణాత్మకమ్,
యథాతతాయినశ్శత్రూన్ యేన గుప్తోఽజయన్మృధే. 2

శ్రీశుక ఉవాచ :-

వృతః పురోహితస్త్వాష్ట్రో మహేంద్రాయానుపృచ్ఛతే,
నారాయణాఖ్యం వర్మాహం తదిహైకమనాశ్శృణు. 3

శ్రీవిశ్వరూప ఉవాచ :-

ధౌతాంఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః,
కృతస్వాంగకరన్యాసో మంత్రాభ్యాం వాగ్యతశ్శుచిః. 4

నారాయణమయం వర్మ సన్నహ్యేద్భయ ఆగతే,
దైవభూతాత్మకర్మభ్యో నారాయణమయః పుమాన్. 5

పాదయోర్జానునోరూర్వో రుదరే హృద్యథోరసి,
ముఖే శిరస్యానుపూర్వ్యా దోంకారాదీని విన్యసేత్. 6

ఓం నమో నారాయణాయేతి విపర్యయమథాపి వా,
కరన్యాసం తతః కుర్యా ద్ద్వాదశాక్షరవిద్యయా. 7

ప్రణవాదియకారాంత మంగుల్యంగుష్ఠపర్వసు,
న్యసేద్ధృదయ ఓంకారం వికారమనుమూర్ధని. 8

షకారం తు భ్రువోర్మధ్యే ణకారం శిఖాయా న్యసేత్.
వేకారం నేత్రయోర్యుంజ్యా న్నకారం సర్వసంధిషు. 9

మకార మస్త్ర ముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః.
సవిసర్గం షడంతం తు సర్వదిక్షు వినిర్దిశేత్. 10

**ఓం విష్ణవే నమః :—**

ఇత్యాత్మానం పరం ధ్యాయేద్ధ్యేయం షట్ఛక్తిభిర్యుతమ్.
విద్యాతేజస్తపోమూర్తి మిమం మన్త్ర ముదాహరేత్. 11

ఓం హరిర్విదధ్యాన్మమ సర్వరక్షాం, న్యస్తాంఘ్రిపద్మః పతగేంద్రపృష్ఠే। దరారిచర్మాసిగదేషుచాప, పాశాన్దధానోఽష్టగుణోఽష్ట బాహుః. 12

జలేషు మాం రక్షతు మత్స్యమూర్తి, ర్యాదోగణేభ్యోవరుణస్య పాశాత్। స్థలేషు మాయావటువామనోవ్యా, త్త్రివిక్రమస్సోఽవతు విశ్వరూపః. 13

దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః, పాయాన్నృసింహోఽసుర యూథపారిః। విముంచతో యస్య మహాట్టహాసం, దిశోవినేదుర్న్యపతంశ్చ గర్భాః. 14

రక్షత్వసౌ మేఽధ్వని యజ్ఞకల్పః, స్వదంష్ట్ర యోన్నీతధరో వరాహః! రామోఽద్రికూటేష్వథ విప్రవాసే, సలక్ష్మణోఽవ్యా ద్భరతాగ్రజో మామ్. 15

మాముగ్రధర్మాదఖిలాత్ప్రమాదా, న్నారాయణః పాతు నరశ్చ హాసాత్। దత్తస్త్వయోగాదథ యోగనాథః, పాయాద్గణేశః కపిలః కర్మబంధాత్, 16

సనత్కుమారోఽవతు కామదేవా, ద్ధయాననో మాం పథిదేవ హేలనాత్। దేవర్షివర్యః పురుషార్చనాంతరా, త్కూర్మోహరిర్మాం నిరయాదశేషాత్ 17

ధన్వంతరిర్భగవాన్పాత్వపథ్యా, ద్ద్వంద్వాద్భయాదృషభో నిర్జితాత్మా। యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాంతా, ద్బలో గణాత్క్రోధవశాదహీంద్రః. 18

ద్వైపాయనో భగవానప్రబోధా, ద్బుద్ధస్తు పాషండగణాత్ప్రమాదాత్। కల్కిః కలేః కాలమలాత్ప్రపాతు, ధర్మావనాయోరుకృతావతారః. 19

మాం కేశవో గదయా ప్రాతరవ్యా, ద్గోవింద ఆసంగవ మాత్తవేణుః। నారాయణః ప్రాహ్ణ ఉదాత్తశక్తి, ర్మధ్యందినే విష్ణురరీంద్రపాణిః. 20

దేవోఽపరాహ్ణే మధుహోగ్రధన్వా, సాయం త్రిధామావతు మాధవో మాం। దోషే హృషీకేశ ఉతార్ధరాత్రే,నిశీథ ఏకోఽవతు పద్మనాభః, 21

శ్రీవత్సధామాఽపరరాత్ర ఈశః, ప్రత్యూష ఈశోఽసిధరో జనార్దనః। దామోదరోఽవ్యా దనుసంధ్యాం ప్రభాతే, విశ్వేశ్వరో భగవాన్కాలమూర్తిః. 22

చక్రం యుగాన్తానలతిగ్మనేమి, భ్రమత్సమంతాద్భగవత్ప్రయుక్తమ్। దందగ్ధి దందగ్ధ్యరిసైన్య మాశు, కక్షం యథా వాతసఖో హుతాశః. 23

గదేఽశనిస్పర్శనవిస్ఫులింగే, నిష్పిండినిష్పిండ్యజితప్రియాసి। కూశ్మాండవైనాయకయక్షరక్షో, భూతగ్రహాంశ్చూర్ణయచూర్ణయారీన్. 24

త్వం యాతుధానప్రమథప్రేతమాతృ, పిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్। దరేంద్ర విద్రావయ కృష్ణపూరితో, భీమస్వనోఽరేర్హృదయాని కంపయన్. 25

త్వం తిగ్మధారాసివరారిసైన్య, మీశప్రయుక్తో మమ ఛిం(ధి)ధి ఛిం(ధి)ది। చక్షూంషి చ(శ)ర్మన్ శతచంద్ర ఛాదయ, ద్విషామఘోనాం హర పాపచక్షుషామ్. 26

యన్నో భయంగ్రహేభ్యోఽభూత్కేతుభ్యోనృభ్య ఏవచ.
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోఽఘేభ్య ఏవచ. 27

సర్వాణ్యేతాని భగవన్నామరూపాస్త్ర కీర్తనాత్,
ప్రయాంతు సంక్షయం సద్యోయే(ఽన్యే)మేశ్రేయఃప్రతీపకాః. 28

గరుడో భగవాన్ స్తోత్రస్తో(భ)మశ్ఛందోమయః ప్రభుః.
రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనస్య వాహనమ్. 29

సర్వాపదోభ్యో హరేర్నామరూపయానాయుధాని నః,
బుద్ధీంద్రియమనః ప్రాణాన్పాంతు పార్షదభూషణాః. 30

యథా హి భగవానేవ వస్తుత స్సదసచ్చ యత్,
సత్యేనానేన నస్సర్వే యాంతు నాశముపద్రవాః. 31

యథై కాత్మ్యానుభావానాం వికల్పరహితస్స్వయం.
భూషణాయుధలింగాఖ్యా ధత్తే శక్తీః స్వమాయయా. 32

తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః,
పాతు సర్వై స్స్వరూపై ర్న స్సదా సర్వత్ర సర్వగః. 33

విదిక్షు దిక్షూర్ధ్వమధ స్సమంతా, దంతర్బహిర్భగవాన్నారసింహః। ప్రహాపయన్ లోకభయం స్వనేన, స్వతేజసాగ్రస్త సమస్తతేజాః. 34

మఘవన్నిద మాఖ్యాతం వర్మ నారాయణాత్మకం,
విజేష్యస్యంజసా యేన దంశితో ఽసురయూథపాన్. 35

ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా,
సదా వా సంస్పృశేత్సద్య స్సాధ్వసాత్స విముచ్యతే. 36

న కుతశ్చిద్భయం తస్య విద్యాం ధారయతో భవేత్,
రాజదస్యుగ్రహాదిభ్యో వ్యాధ్యాదిభ్యశ్చ కర్హిచిత్. 37

ఇమాం విద్యాం పురా కశ్చిత్కౌశికో ధారయన్ ద్విజః,
యోగధారణయా స్వాంగం జహౌ స మరుధన్వని. 3

తస్యోపరి విమానేన గంధర్వపతిరేకదా,
యయౌ చిత్రరథః స్త్రీభి ర్వృతో యత్ర ద్విజక్షయః. 3

గగనాన్న్యపతత్సద్య స్సవిమానో హ్యవాక్ఛిరాః,
సవాలఖిల్యవచనాదస్థీన్యాదాయ విస్మితః. 4

ప్రాప్యప్రాచ్యాం సరస్వత్యాం స్నాత్వా ధామ స్వమన్వగాత్,
య ఇదం వృణుయాత్కాలే యో ధారయతి చాదృతః. 4

తం నమస్యంతి భూతాని ముచ్యతే సర్వతో భయాత్,

శ్రీశుక ఉవాచ :—

ఏతాం విద్యామధిగతో విశ్వరూపాచ్ఛతక్రతుః,
త్రైలోక్య లక్ష్మీం బుభుజే వినిర్జిత్య మృధేఽసురాన్. 4

ఇతి శ్రీమద్భాగవతే షష్ఠస్కంధే
అష్టమోధ్యాయః